Regd No. M. 3289 విడిపత్రిక అణా Regd No. N. 45

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 102453 జులై ౧౨వ తేది ౧౯౩౭ సోమవారము అర్ధసం॥ చందా ౩

సంపుటము ౧౨ | తూపుబజారు హైద్రాబాదు - దక్కన్ | సంచిక ౧౯

శా. శ. ౧౮౫౯ == శ్రీ ఈశ్వర సం॥ ఆషాఢశు॥ ౪ సోమవారము == ౬ మహారేవరు ౧౩౪౬ ఫ.

# ప్రాచీన భారతము:

## ౨ దేశ వైశాల్యము

### ఆఫ్రికాఖండము కనుగొనుటకు కృష్ణానది వర్ణనములే కారణములా?

గజ్నవీ నుండి సమర్ఖండ్ వరకు యాదవసామ్రాజ్యము విస్తరిల్లియుండెను

భారతీయులు యవనులను పాలించిరా?

చారిత్రక ప్రాముఖ్యత గ్రహించుకొందము

మన పురాణములు జనసామాన్యమునందు భక్తిశ్రద్ధలుదయింపజేయు నుద్దేశముతో స్వార్థపరుల రచనములనియు, వానిలో నివర్ణితములు కేవలముకల్పనలనియు పలుకుచుందురు. "పుక్కిటిపురాణముల"ను వచనమొకటి వీనియాధారముపై రచింపబడుటయే గాక యసంభవవిషయములన్నియు నీశీర్షిక క్రింద నెట్టివేయబడుచుండుట ప్రతివానికివిదితము. భారతీయులందలి విచిత్రతర్కబుద్ధి, ఆంగ్లసంపర్కము సిద్ధించినను, నానాటికి వృద్ధిగాంచుచు నేయున్నది. మనదురదృష్టమున కిదియొక ముఖ్యకారణము.

"అంగడిలో అన్ని కాని అల్లునినోటిలో శని"యనునటుల మనదేశ, జాతి చారిత్రక సాధకములు మనవద్దనున్నను మనస్థితి మనము కనుగొనలేక మనప్రాచీనచరిత్ర, మనయున్నతదశ పాశ్చాత్యుల పరిశోధనలవలన కనుగొని యవ్వనపొందు హేయదశ తటస్థించినది. నేడు మనకు వారిమాటలే వేదవాక్కులుగా గలవు, వారువిశదపరచువిషయమే సత్యసమ్మతము గా గలదు. వారినిర్ణీతములే చారిత్రకాధారములుగా నంగీకరించుటగలదు. పాశ్చాత్యులు, మనము హేయముగా, కల్పితరచనలుగా ద్రోసివేయుచున్న, మనపురాణముల నేపఠించి, పరిశోధించి మనప్రాచీననాగరికత, సభ్యత, దేశవైశాల్యము మొదలగు నెన్నియో యమూల్యవిషయముల, నవీనచారిత్రకాంశములబహిర్గతపరచుచున్నరహస్యములు, వారుగావించుచున్న మహోపకారములు, మనకునూతనములుగాన్చె.మన పురాణాధారముపై పాశ్చాత్యులాఫ్రికాఖండమును —పురాణములందలి "నీలనది" [దీని నైలునందురు] లేక "కృష్ణానది" వర్ణనననుసరించి ఆఫ్రికాకనుగొనబడినది — ప్రపంచమునకు విదితమునరించినపిదపనే పురాణములకొంత చారిత్రకప్రాముఖ్యత నొసగబడినదనియతిశయోక్తి కాజాలదు.

కాశ్మీరవంశజాలు: "వామనపురాణ"పు పూర్వార్థభాగముసందు భారతవర్షపు విస్తీర్ణవర్ణన విపులముగాగలదు. భారతవర్షముత్తరప్రాంతమున తుర్కీవరకు వ్యాపించియుండెను. ఇది నేడుయూరపుఆసియాఖండములలోవిభజితమైనటుల పూర్వకాలమునందిది "ఖాండ""బయలు" యను రెండుభాగములలో నేర్పడియుండెడిది. క్రీ. ౭ శతాబ్దమువరకు తుర్కీ కాబూలు రాజులు కాశ్మీరరాజవంశీయులైయుండుటచే నిది వీరియాధీనమైయుండెనటుల దోచుచున్నవి. ఇచ్చటిరాజులు, కాశ్మీరరాజశబ్దములే తమ నామాంతరములందుపయోగించుచుండినటుల భారతప్రభుత్వపు అర్కశాఖవారినివేదికలు కానవా ధారములపై విశదపరచుచున్నవి.

యాదవవంశజాలు: దక్షిణదేశమున జయభేరి మ్రోగించి ప్రజాభ్యుదయాదర్శముతో పరిపాలనమొనరించిన యాదవరాజులు తమప్రయత్నములు దక్షిణప్రాంతమునకే ప్రత్యేకించక ఘజ్నవీనుండి సమర్ఖండ్‌వరకువ్యాపింపజేసి ఆయా ప్రాంతములు కొన్నిశతాబ్దములవరకేలినటుల "టాడ్ రాజస్థానకథావళి"యందు వివరముగా గలదు. నేటికి ఆప్రాంతములందలి ప్రజలు —పఠానులు, తురుష్కులు — తాము "యద్దు" మతావలంబకులమని నిర్భయముగా తెలుపుకొనుటచేసి "యాదవ"శబ్దమే "యద్దు"గామారి వచ్చుట సహజము.

> "నేను తుర్కీనుండి బసరావెళ్లుచున్నప్పుడు దారిలో "గోవిందరామ""కల్యాణరామ" యనబడు రెండుదేవాలయముల దర్శించగలిగితి. దేవాలయములందలిమూర్తులు సజీవములుగా, తేజోరాసులుగానుండుటచే చూచువారలకు భక్తిభావములు పుంజీభవింపజేసితీరునను ట నిశ్చయము.
>
> — పూర్ణగిరి యాత్రావివరములు.

బ్రాహ్మణపరిపాలనము: పశ్చిమమున భారతవర్షము ఆసియామైనరుదేశమువరకు విస్తరిల్లియుండెను. అరబుదేశమైనను భారతవర్షపుభాగముగా నుండెయుండెనని చరిత్రకారుల యభిప్రాయము. మహమ్మదీయులకు పవిత్రస్థానమగు మక్కా అకాలములో "ముక్తేశ్వర"డను బ్రాహ్మణుని పరిపాలనమునందుండినటులను, తనపేర ఆతడచట నొక గొప్పశివాలయమునిర్మించినటులను, ఆతనికుమారుడగు "శూరవార్య"ని దేశమునుండి దేశీయులందరేకమై తరిమివేసినటులను అర్కశాఖవారి నివేదికలు తెలుపుచున్నవి.

అకాలమునందు యవనులు ఆసియామైనరుదేశము నదినివేశరాజ్యముగా నేర్పరచుకొనియుండిరి. ఆసియామైనరుప్రాంతమంతయు భారతాధీనమై యుండినందున భారతీయులుయవనులను బరిపాలించినటుల దెలుచున్నది కేవలమనుమానమే గాక యీవిషయమును "విష్ణుకోశము" నిశ్చయమని నిర్ణయించుచున్నది.

మహమ్మదు — ఇస్లాముమతప్రవక్త — జననమునకుపూర్వము మక్కాలో నివసించువారలే గాక యాప్రాంతీయులందరగ్నిపూజాపరులైయుండిరి. భారతీయులీప్రాంతమునకు స్వదేశమునుండి వ్యాపారార్థము తరుచుగా వెళ్లుచుండెడివారు బ్రహ్మాండపురాణమునందు భారతవర్షపుఉత్తరపశ్చిమ సరిహద్దుప్రాంతము వర్ణనలుగలవు రఘుమహారాజీదేశమునకు వెళ్లినటుల మహాకవి—కవిసార్వభౌమ— కాళిదాసుని రచనలవలననేగాక విఖ్యాత ప్రపంచయాత్రికుడగు పూర్ణగిరి వేలకొలదిభారతీయులు—హైందవులు—ఈప్రాంతములందు స్థిరనివాసులుగానుండినటుల తనయాత్రావివరణమునందుల్లేఖించియున్నారు.

నవద్వీపములు: ప్రాచీనకాలమునందు భారతవర్షమునకు నవద్వీపములు—ఇంద్రద్వీపము, కశేరుద్వీపము, తామ్రద్వీపము, గభస్తిద్వీపము, నాగద్వీపము, సౌమ్యద్వీపము, గంధర్వద్వీపము, జంబూద్వీపము, క్రౌంచద్వీపము,—లోబడియుండినటుల బ్రహ్మాండపురాణము విశదపరచుచున్నది. వర్తమానకాలపు యాఫ్రికాఖండమునకు సమీపమందలి మారిషస్ ద్వీపము నాడు గభస్తిద్వీపముగా వ్యవహారితమగుచుండెను: విష్ణుకోశపు గ్రంథకర్త చిత్రించిన భారతవర్షపుచిత్రమువలన నాగద్వీపము, తామ్రవర్ణద్వీపముల నామములు లంక [సిలోను] సింహళము — లేక పరిసరప్రాంతద్వీపములనుండినటుల తెలియుచున్నది. ఆఫ్రికాకుసమీపమున గల మడగాస్కర్ ద్వీపము నాడు చంద్రద్వీపమని పేర్కొనినటుల యనేక చారిత్రక నిదర్శనములుగలవు. ఆఫ్రికాఖండమందలి యధికభాగము భారతవర్షమునకు జెందియున్నటుల మార్కండేయపురాణము తెలుపుచున్నది. భవిష్యోత్తరపురాణమునందాఫ్రికాదేశీయుల వర్ణన విపులముగాగలదు.

పాశ్చాత్యభాగము] భారతవర్షము తూర్పున "క్షేత్రము" వరకు వ్యాపించియుండినటుల "వామనపురాణము"నందు గలదు. ప్రస్తుతమీ "క్షేత్ర"మే నామముతో వ్యవహారితమగుచున్నది నిశ్చయముగా విశదమగుటలేదు. కానిపాశ్చాత్యభాగమునందు చీనా, సయాము వరకు భారతవర్షము విస్తరిల్లియుండినటుల "మత్స్యపురాణము" నందుగలదు. "సయా"మే నాడు "సువర్ణదేశము"

గోలకొండ పత్రిక

## ౧౨ వ సంవత్సరాది సంచిక

చదివితీరవలసినది — అమూల్యవిషయములు

౧ సురవరము ప్రతాపరెడ్డిగారి "భాషాచార్జన్యము" ౨ మొల్లాప్రగడ సీతాకుమారిగారి "నిజాంరాష్ట్రములో స్త్రీజనోద్యమము, ౩ మాడపాటి హనుమంతరావుపంతులుగారి "పార్యప్రణాళిక—నిజాంరాష్ట్ర పరిపాలనము, ౪ ఉమ్మెత్తల కేశవరావుగారి "జేరుబావులి భూమిపన్ను, ౫ మందుముల రామచంద్రరావుగారి "మన న్యాయస్థానములో దేశభాషలకున్నస్థానము, ౬ ఒక హితైషిగారి "మనప్రభుత్వమువారి మతశాఖ", ౭ కొండా వేంకటరంగారెడ్డిగారి "మనభూములు—అందులోని వృక్షములు" ౮ పింగిలి వెంకటరామారెడ్డిగారి "విజయనగర సామ్రాజ్యము" మున్నగు అనేక ముఖ్యవిషయములుగల వ్యాసములు పెక్కులున్నవి, నిజాంరాష్ట్ర సమస్యలనుగూర్చి తెలిసికొనగోరు ప్రతియాంధ్రుడును చదివితీరవలసినది.

గోలకొండపత్రిక చందాదారులు రెండణాల టప్పాబిళ్లలు పంపినచో ఉచితముగా పంపబడును- ఇతరులకు ౦-౪-౦

మేనేజరు గోలకొండపత్రిక

తూపుబజారు, హైద్రాబాదు-దక్కన్.

గా వ్యవహారితమగుచుండెను. మరికొన్ని పురాణములవలన ఆఫ్రికాఖండములోని యధికభాగము భారతాధీనమై స్వదేశముతోబాటు సమవృద్ధి గాంచుచుండినటుల దెలియుచున్నది.

విభజన] ఇంతేగాక "పురాణము"వలన ఆ నాటి యూరపు, ఆఫ్రికా, ఆసియాఖండములపై భారతవర్షపు కబ్జా—Possession— ఉండిన టుల దేలుచున్నది. "అశ్వక్రాంతము" "రథక్రాంతము", "విష్ణుక్రాంతము" అను మూడుభాగములలో మొత్తము భారతావని విభజితమైనటుల "నారదపురాణము" నందుగలదు. "పదార్థదీపిక" యందలి "ఇషిజాత", "ఓషుజాత", "ఇషిచాకి"యని వ్యవహరింప బడియున్నది.

వివరణము] "అశ్వసక్రము" ప్రస్తుతపు యూరపుఖండమని పరిశోధకుల యభిప్రాయము. ఇది చాలావరకు సమంజసముగా గలదు. యూరపునకు, "జ్యాపిటరు"—బుధుడు—శబ్దమునకు చాలా సంబంధముగలదు. ఈజ్యాపిటరెల్లప్పుడు "శ్వేతవృషభాకారము"తో నున్నటుల యొకగాథగలదు. ఈగ్రహ మీ యాకారముతో మందగమనముతో తిరుగుచుండును. "అశ్వ"మనగా నుఖము, "ఇషు"వనగా దాని గమనము. "ఇషుజాత." "అశ్వక్రాంతము"ను నామములు యీఖండమునకు దీనివలననే వ్యవహారితములైనవనుట నిశ్చయము.

"రథక్రాంతము" ఆఫ్రికాఖండపు ప్రాచీననామమని దేటపడినది. భూమధ్యరేఖ—Equator—యీఖండములోనుండియే జరుగు చున్నది సూర్యనియతివేడికి దేశీయులు నురియగు టగలదు. కొన్నిగ్రంథములందు "రథక్రాంతము"నకు "సూర్యావర్త"మనియు గలదు. ఆఫ్రికాఖండ మీనామములతో వ్యవహారితమైనటుల మరికొన్ని పురాణములలోగలదు. ఇంతేగాక "భవిష్యపురాణ" పూర్వార్థభాగమునందు "రథక్రాంత"పు దేశీయులవర్ణన యిటుల గలదు:

"ఆప్రాంతీయుల వర్ణము నీలము.
వీరు మందబుద్ధులు; మాంసాహారులు
అంగశ్యాకార శిరోజాలు
.........................."

ఈవర్ణనయంతయు "నీగ్రో" జాతివారి కన్వయించుచున్నది.

"ఇషిచాసక" లేక "ఆశేచనక"ము ప్రస్తుతపు ఆసియాఖండమని నిర్ణయింపబడినది. నామములనుబట్టి పోలికయేగాక "భవిష్యపురాణ" పూర్వార్థభాగమునందిషిచానకుల వర్ణన గలదు:

"...... ఈప్రదేశము అందుండువారు
శ్వేతవర్ణముగలిగియున్నారు. వీరి నేత్రములు నీలముగానుండును. ఆధికవిషయములందు వీరుప్రవీణులు, గొప్పమేథాసంపన్నులు. సోమపానప్రియులు......"

మహాశాస్త్ర నిపుణుడగు ఖదవాలుడు యీజాతికి సంబంధించినవాడు, స్థిరనివాసి. ఇచ్చటినుండియే యీజాతివా రన్యప్రాంతములకు వెళ్లినటుల గలదు. "బుజూమాల"యందలి మహాశాస్త్రవ్యాఖ్యానము వలన యీతడా సియావాసిగా ఋజువైనది. "ఆశేచనకుల"గురించి "ఈరాష్ట్రములో వివిధజాతులవారు గలరు. మతములందు, వర్ణనలందు పోలికగలదు. రెండుభాగములలో వీరల విభజించవచ్చు"నని గలదు.



# కులాయము

బొడ్డు బాపిరాజుగారు

నల్లడల కప్పుకొన్న సంధ్యాప్రసూన
సౌరభమ్ముల కనులు పచారుదిరుగ
అరమరపులో తదేకసంస్మరణమంటి
నెమ్మి మాగృహవాతాయనమ్ము చెంత.

అరుణసుందర రేఖాసహస్రకోటి
విరియ వచ్చిన గోనుచుక్కపూసరులగడచి,
మెరుగులోలాడు చివురాకు మేడదాటి,
గగనమున నెందో లీనమై కరగెనూహ!

ఎవరు కల్పించినారలో, యీ విహాయ
సమ్మున విచిత్ర వచిత్రశాలదీని?
ఏ కళారాధకుని ముగ్ధ హృదయవీణ
చెదరినతలంపు లిట్లు కుంచియకునెక్కె!

ప్రేమమయుడైన యాజగత్పిత రచించు
విశ్వకావ్యమునను వెల్లి విరయుచున్న
మధుర మధురానురాగ సంపదయె యిట్లు
కరుడుగట్టినదో సాంధ్యకాలమూర్తి!

అనుమపు వెలుతెరగల తానమాడి
క్రొత్తయందమ్ములను దెచ్చుకొన్నదొకటి;
చిత్రభావమ్ములను నటించినది యొకటి;
యింటిముందున్న చెట్టు, హాయొదదయున్న

దశదిశాంచల చిత్రప్రదర్శనావ
లోకనభ్రమణ పరాయణైకవృత్తు
లనుచు చూపులు వచ్చి ! వాలినవి చెట్టు
కొమ్మపై కొలువున్న కొకమ్మమీద.

కౌటుకలు బొమ్మదీర్చిన కగణి, సంజ
వెలుగులో వింతనిగనిగ లొలయతనువు
ముకునందొకపుల్లను నొక్కిపట్టి
చూచుచున్నది నలువంక శుక్రదృష్టి.

అంత నొకబాయసము రెక్కలార్చుకొనుచు
వేరొకా నొకపుల్లతో జేరవటకు
చిన్నిచూపులతోట భాషించుకొనిరి
మనసునందున్న విషయ మాల్నగలువారు.

గుబురుగానున్న కొమ్మల కుదురులోన.
పచ్చనాకులు నీడలు పట్టుచోట,
అర్ధనిర్మాణమున నాగినట్టి చిట్టి
గూడు వారికొరకెదురుచూడగంటి.

అలతి చెంగవాలను కులాయమ్ము దాన,
వాని పనివానితనము చూపట్ట, నేర్పరించుచున్నవి; ఎపుడభ్యసించె? నౌర!
జ్ఞాన మెరుగని చిన్నద్విజమ్ము లివ్వి.

వాటి చాకచక్యము, వాటి పట్టుదలయు,
వాటియోపిక, వాటి శిల్పమ్ము నరసి
కొమ్మదిగిరావు చూపులు, గూటిలోన
నెచట చిక్కువడ్డదో చిత్త మెరుకలేదు!

కావి సంజలు నీలియాగడపలందు
పలుచబడిపోవకయె మున్న పక్షిజంట
యెందుపుల్లల నెచటనో యేరితెచ్చి
చక్కగా గూడుకట్టె స్వశక్తినూది.

"ఎందుకో పక్షిదంపతు లీర లింత
శ్రమకు పాల్పడి, పూనిక కులాయమిద్ది
యెవరి సుఖవాసమునకు గల్పించినారు?"
అనుచు ప్రశ్నించితిని కొంటెతనముచూప.

"భావిసంతాన సుఖమయ జీవనమున
కాలవాలమ్ము; ఇందుమా యాత్మలొకటి
గాగ ప్రతిఫలించిన ప్రాణిగణము మసలు;
పుణ్యఫలనిందు వచ్చి కాపురము సేయు.

ఎండకింతయు కసుగందకుండ బ్రోచి,
చెవటినీతువుబారికి చిక్కనీక
దాచి, జడివానయలజడి నాచి, చంటి
గ్రుడ్డులను దల్లియై యాదుకొనగలదిది.

ఈహృదయదీప నిట విక్రమించుకొరకు
వేసవనుండి శ్రమ లలపెట్టకుండ
దిశల చీకటి తెరచీర దిగకముందె
పనిని ముగియించినార మిప్పటికినరుడ!"

"ఏలమీరంత బెదవవహింప? సకల
విశ్వనిర్మాతయైన సర్వేశ్వరుండు
కన్నువిప్పని మాచిన్ని కొన్నుబ్రోవ
జాలడే?" యంటి చిరునవ్వు రాలుచుండ

ఒకరి నెమ్మోము నొకరు చూచుకొనిరా
వాడిపడి చూపుబిప్పి చిర్నగవుతోడ
మౌనమునవింత భావమ్ము పూని, రందు
నావివేకము చొప్పు గన్పట్టెనపుడు.

"సకలజీవనదాత యొసంగినాడు
మీకునుక, మాకురెక్కల మీది బ్రతుకు
యేలకుంచించవలె నాతడిచ్చినట్టి
శక్తి? పరులబాపట కగచాట్లవేల?

ఆత్మబలమును నేపథ్యమందునిలిపి
చప్పబడుటలు పనిగాదు; శక్తికొలది
అడుగుముందిడి జీవనయాత్ర సాగ
వలయు, ఫలవిచారమ్ము నాతలను బెట్టి

పెంచి నిను బెద్దజేసి, కష్టించి బ్రతుక
దగిన యునువును కల్పించి జగముచూపు
ము సలితండ్రికి మెడవ్రేగు, విసువుగాను
యెన్ని నాళ్లుసుఖింపనా నన్న, నీకు?

మనపదమ్ములమీదనె మనము నిలువ
గలము గాకున్న, పరుల చేబలమునమ్మి
యెంత సేపుండగలము? రవ్వంతయలవి
కెడము కాగ చేయూతనందించునతడె!

మానవులుమీరు, మాకంటె జ్ఞానమూర్తు,
లన్నిటను పెద్ద చేయి మీయందనిలిచె;
కన్నతండ్రికి కడుగూర్పు కొన్నవిమీది.
పోయివత్తుమేమిక సెలవీయవోయి?"

అపలుకు లాలకించుచు నాకసమున
చరమ సంధ్యారుణ ప్రకాశములు ససిగె,
విదియ నెలరేక నావలె చదల నలికె
అవికసు పోడ్చి. నిద్రవూ "కత్తె"యనియె

# సింధు దేశములో గొన్ని విపరీతాచారములు

## తురకలు హిందూ బాలికలను వివాహమాడుట

శ్రీ పునుగు సీతారామ శాస్త్రి గారు

సింధుదేశమున నిటీవలజరిగిన ఎన్నికలప్పుడు హిందూబాలికలను మహమ్మదీయులుశతాబ్దములుగా వివాహమాడుచున్నారన్న విపరీతాచారము బయలుపడినది. సింధురాష్ట్రములోని ౧.థార్, ౨.సార్కర్ జిల్లాలలోనీయాచారము ఇప్పటికినివాడుకలోనున్నది. ఇది దురాచారమనియు, ఇట్టివివాహములు కూడదనియు గొందఱుహిందువులిది వేదమతమనుసరించువారు చేయగూడనిదని యెట్టిప్రబోధములుగావించుచున్నను నాల్గునూర్ల సంవత్సరములుగా జరుగుచునే యున్నవి.

పైజిల్లాల నొకానొకతాలూకాలో నీయాచారము కొన్నిరాజపుత్రులు కొన్ని మహమ్మదీయులలో బరిపాటియైయున్నది. మహమ్మదీయులలోనిట్లు రాజపుత్రి కన్యకలను వివాహమాడువారిని అర్బాబ్ తెగవారనబడుదురు-ఈయార్బాబు తెగ మహమ్మదీయులలో మొగవారు రాజపుత్రి తెగ హిందూ బాలికలనే ౪౦౦ సంవత్సరములుగా వివాహమాడుచున్నారు.

ఈవిధమైన వీరివివాహములవలనరాజపుత్రస్త్రీలు తమ హిందూమతము విడచాడుటలేదు. ఈస్త్రీలు తమభర్తలయిండ్లలోగాపురము చేయుచుండునప్పుడు తమ తల్లిదండ్రుల హైందవాచారములనే పాటించుచుండెదరు_మహమ్మదీయదీక్షను స్వీకరింపరు- వారా మరణాంతము హైందవాచారములనే కలిగియుండెదరు.

వివాహము హైందవమతాచారముగా కన్యకయింట్లోనే జరుపబడును. ఇట్లు వివాహకర్మ కన్యకయింట్లో నెరవేరినపిదప మహమ్మదీయుడైనవరుడు నూతనముగా తాను వివాహమాడినకన్యకను తనయింటికి దోడ్కొనివెళ్లి యచ్చటనొక ముల్లామూలమున మహమ్మదీయాచారముమేరకు మరలవివాహతంతువును బూర్తి చేసికొనును.

వధువులు వివాహమప్పుడుగాని, యావల వారిజీవద్దశలో నెప్పుడైననుగాని మహమ్మదీయదీక్ష స్వీకరింపరు. ఈస్త్రీలు తమహైందవాచారముచొప్పున తమమహమ్మదీయభర్తలయిండ్లలో పూజా పునస్కారములు జరుపుకొనుటకు ప్రత్యేకమైనగదులు గలిగియుందురు. ఆగదులలో వారు విగ్రహారాధనలను జరుపుదురు. ఈ స్త్రీల హైందవనామములు కూడ మార్పజెందవు. వంటవార్పులుకూడ హిందూపద్ధతులప్రకారమే జరుపుకొందురు. రాజపుత్రులు సాధారణముగా మాంసాహారమును గొందురు-కాని, గొడ్డుమాంసమునుభుజింపరు. కావున గోమాంసము నీస్త్రీలువండరు, భుజింపరు. ఇదివీరికిమహాపాపము. ఈవిధమైన విగ్రహారాధనలు, గోమాంసనిషేధము తమస్త్రీలాచరించుచుండినను భర్తలగుమహమ్మదీయులు వారిని యేమాత్రము నిర్బంధపెట్టరు-ఆస్త్రీలను వారి తలిదండ్రుల యాచారములనే యాచరింపజేయుదురు. మహమ్మదీయయాచారములను వారిచేనాచరింపించుటకే నిర్బంధములను జేయరు. ఈరాజపుత్రస్త్రీలు తమభర్తల యిండ్లలో తులసికోటకట్టించుకొని యందు తులసివృక్షమునాటిదానికి నిత్యమునీళ్లుపోసిపూజించి యావృక్షపుపాదులోనినీళ్ల నాచమించిగాని భుజింపరు. శ్రీరామకృష్ణాదిజయంతులనాడు ప్రతిపక్షపు ఏకాదశులనాడుఉపవసించి యాదేవుళ్ళనారాధించెదరు. ఇవ్విధముగాతమభర్తలయిండ్లలో నీరాజపుత్రి స్త్రీలు భర్తల మతమునకు ప్రత్యక్షభిన్నమైన హిందూమతము నాచరించుచు వారితో గాపురములజేసి వారికి బిడ్డలగనుచుందురు.

ఈదంపతులుగన్న బిడ్డలు మహమ్మదీయులగుదురు. వీరి స్త్రీ సంతానమును ఇతర మహమ్మదీయ తెగలవారు వివాహమాడుదురు. హిందువులు వీరికన్యకలనువివాహమాడరు. వీరి మగపిల్లలు మతమునమహమ్మదీయులైనను వీరు మరల రాజపుత్రివధువునే వివాహమాడుదురు. గాని, యితర మహమ్మదీయ తెగలో నుండు స్త్రీలను వివాహమాడరు. ఈయాచారము సుమారు ౪౦౦ సంవత్సరములుగా సెట్టికలతలకౌస్పదముగాక శాంతముగా నీ తెగలో సాగుచుండుట వింతగొల్పుచున్నది. ఇట్లుజరుగుచున్నను ఒకానొకచోట రాజపుత్రుడొక మహమ్మదీయస్త్రీని వివాహమాడుటయు గలదు. వారికికలిగిన సంతానముకూడ హిందువుగానే పరిగణింపబడును. ఈరాజపుత్రి తెగవారుతమ యాచారములలో బీజమునే ప్రధానముగా గణించి, క్షేత్రము అప్రధానముగా నెన్నుదురు. సాధారణముగా హిందువులు ఏతెగస్త్రీకి సంతానమును బడయుదురో ఆసంతానమును ఆస్త్రీ తెగలోనే చేర్చుట ఆచారము. ఈయాచారమునకు సింధూరాజపుత్రి తెగల ఆచారము ప్రత్యక్షవిరోధముగా నున్నది.

ఇటీవల యీసింధురాజపుత్రుల నీయాచారమును విసర్జించునట్లు యత్నములు కొందఱొనర్చిరి. కాని, ౪౦౦ సంవత్సరములుగా నీ తెగలో నాటుకొని యిదియు వారిలో సదాచారముగా నెన్నబడుచుండగా నియ్యది యెంత దురాచారమని యెంతప్రబోధించినను దానిని విసర్జించుటకు సాధ్యముకాదు. ఈ ఎన్నికల ఆడావడప్పుడు "అర్బాబు జాతివారు మహమ్మదీయులు కారు. మహమ్మదీయులు వారికి ఓట్లనీయగూడదని" పెద్ద గోలబెట్టిరి.

ఇట్లుండగా నొక అర్బాబు జాతిలోనివాడు భార్యనుగోల్పోయెను. వాడు మహమ్మదీయాచారప్రకారము మొక మహమ్మదీయవితంతుస్త్రీనిగాని మహమ్మదీయ తెగలోని కన్యకనుగాని రెండవవివాహమాడుటకు సమ్మతింపలేదు. తమకు నాల్గుశతాబ్దములుగా రాజపుత్రిస్త్రీలను వివాహమాడుట యాచారమైనందున ఆతెగ స్త్రీ తనకు ద్వితీయ వివాహమునకు లభింపనిచో తాను వివాహమునే యాడననియు విధురుడై యుండెదననియు జెప్పెనట. ఇందువలన వీరిలో నీయాచారము ఎంతలోతునకు బాతియున్నదో పాఠకు లూహించెదరు గాక!

ఈయాచారమెప్పుడు వీరిలో నుత్పన్నమైనదో నిర్ణయించుటకు సాధ్యముకాదు. సింధురాజ్యముపై క్రీ. శ. తొమ్మిదవశతాబ్దములో మహమ్మదీయులు దండెత్తి వారాదేశమును లోబఱచుకొని యీ వేయి సంవత్సరములుగా నచ్చోటిప్రజలు వీరితో గలసిమెలసి యున్నారు. మొట్టమొదట అచ్చోట పాలకులుగనుండిన రాజపుత్రి తెగలకు నూతనముగా దేశము నాక్రమించుకొనిన మహమ్మదీయులకును దీర్ఘవైరములతోగూడి కలతలు సాగుచునేయుండెను. కాని, పిదప ఆఱేడునూర్ల సంవత్సరములకు రాజపుత్రివంశముల శౌర్య మడుగంటినికరమైన రాజపుత్రివంశముతే శూన్యావస్థజెందినవి. కొనకుపాలకులైన మహమ్మదీయులతో నచ్చోటి హిందూవంశస్థులకు రాజీ కుదిరి, విధిలేక యీయాచార మేర్పడియుండును. అక్బరుచక్రవర్తిదినములకే యీరాష్ట్రములో నీయాచారము స్థిరముగా వేరుపారియుండెను. ఎంత బహుకాలముగా నాచరింప బడుచుండినను నిది దురాచారముగనే యెన్నబడవలయును.

[క్రమశః]

# తెలంగాణా వార్తలు

### కలరా

వరంగల్లులో కలరా లేచి రోజుకు ముప్పదిమంది వఱకు మరణించుచుండిరి. అనేకులు హైదరాబాదు, సికింద్రాబాదులకు లేచిపోయిరి.

### సహకారసంఘ ధనాపహరణము

పర్గి తాలూకాలో చేరిన సుఖ్నాపూరులో సహకారసంఘమునకు సుమారు రూ. ౪౬౮౫ లు ఇవ్వవలసియుండు ఒకరు తెలియకుండ పారిపోయిరి.

### నీటికఱవు

సిద్ధిపేట, షోరాపూరు తాలూకాలలో వర్షములు బొత్తిగా లేనందున నీటికఱవు ఏర్పడినట్లును, జనులు చాల తల్లడిల్లుచున్నట్లును తెలియుచున్నది.

### పన్నులు ఎక్కువగుట

మహబూబాబాదులో ఇంటిపన్నులును, వెలుతురుపన్నులును ౬ పాయీలనుండి ౯ పాయీలకు హెచ్చింపబడినవి.

### మహబూబునగరు లోకల్ఫండు కమిటీ

౧౩౪౬—౧౩౪౯ ఫ. సంవత్సరములకు మహబూబునగరు లోకల్ఫండు కమిటీలో అవ్వల్ తాలూక్దారు, జిల్లాన్యాయాధికారి, జిల్లావిద్యాధికారి, జిల్లాపోలీసు అధికారి, జిల్లా వైద్యాధికారి, డివిజనల్ యంజినీరు, తహసిల్దార్లు అధికార సభ్యులుగను, మహమ్మద్ అబ్దుల్లా మన్నాది, నారాయణ రావు, మహమ్మద్ ఉమరలీ, మహమ్మద్ మునీరుద్దీన్, మహమ్మద్ ఖాన్, మహమ్మదీనజీర్, రామన్న అను వారలు అనధికారసభ్యులుగ నియమింపబడినారు. 2 గురు అధికారులును 6 గురు అనధికారులు.

### మెదకు సూబేదారుగారి దౌరా

మెదకు సూబేదారుగారగు అహమ్మదు అలీఖాన్ గారు నిజామాబాదు జిల్లాలో సంచారము చేసి బన్స్వాడ, నిజామాబాదు, కామారెడ్డి, బోధన్ మున్నగు కేంద్రములందు ప్రభుత్వకార్యాలయములను చూచిరి

### గంగావతి

గంగావతిలో వర్షములు తృప్తికరముగ పడెను, అక్కడ మున్సిఫ్ అగు జమాలుద్దీన్ గారు దీర్ఘకుమార్పబడిరి. వారిస్థానములో గణపతిరావు పనిచేయుచున్నారు.

### గ్రంథాలయమునకు సూబేదారుగారి విరాళము

మెదకు సూబేదారులగు మీర్ అహమ్మదు అలీఖాన్ గారు అవ్వల్ తాలూక్దారులతో కూడ నిజామాబాదు జూబిలీ గ్రంథాలయమును చూచి, రూ౫౦లు విరాళమిచ్చిరి.

### పురపాలకసంఘ ఎన్నికలు

రాయచూరు పురపాలకసంఘపు ఎన్నికలలో నవాబు దోస్తుమహమ్మదుఖాన్ గారు జాగీరుదారులపక్షమున అభ్యర్థిగ నిలవనున్నారట.

### మహబూబునగర్ జిల్లా వార్తలు

[స్వకీయవిలేఖరి]

౨౫—౯—౪౬ ఫ—

మౌల్వీ సయ్యదుమహమ్మదు ఆలీబిల్గ్రామి [మొహతెమీము విద్యాశాఖ మహబూబునగర్] గారు పరిశీలననిమిత్తమై లింగాలకువచ్చి ఇచ్చటి ప్రాథమిక బాలుర పాఠశాలను, ఆంధ్ర బాలికల ప్రాథమిక పాఠశాలను పరిశీలనచేసి తేది ౨౫—౯—౪౬ సాయంత్రము మహబూబునగర్ కు తిరిగిపోయిరి.

మహబూబునగర్ జిల్లా కొల్లాపూర పేట ఆంధ్రబాలికలపాఠశాలలో క్రీస్తుపంతులమ్మ బాలికలకు మతబోధనలు చెప్పినట్లును పిటినిగుఱించి పాఠశాలలో బాలికలు తక్కువ అయినట్లును ఎంచి ఆమెను నల్గొండజిల్లాకు విద్యాశాఖవారు మార్చినట్లు తెలియుచున్నది.

## మా చందాదారులకు

తమ ఉత్తర ప్రత్యుత్తరములలో చందా నంబరు తెలుపవలెను. లేదేని జవాబు ఇవ్వబడదు. తమ లేఖలు మేనేజరు పేర వ్రాయవలెను,

నో:— చందానంబరు తమకుపంపుపత్రిక పైన వుండును.



# స్థానిక వార్తలు

### ఉద్యోగ విషయములు

అవ్వల్ తాలూక్దారు మురాదలీఖాన్ గారికి ౨౧ ఖుర్దాదునుండి ఒకసంవత్సరము సెలవీయబడినది. రాయ్ ఏక్నాథ్ ప్రసాదుగారు వారి స్థానమున పనిచేయుచున్నారు. రికార్డుఆఫు సెక్రెటేరియట్ ఆఫీసులో ప్రత్యేకాధికారియగు మహమ్మదు నాసిర్ ఖాన్ గారు సెలవుపైపోవుటచే పారెండలతహసీల్దారుఅగు గోవిందరావుగారు వారి స్థానములో పని చేయుటకు నియోగించబడినారు.

దుర్వంతాలూక్దారు గులాం మొహియుద్దీన్ ఖాన్ గారు ఖుదుస్ హుసేన్ గారు పోవుటచే వారిస్థానములో నియోగించబడినారు జగ్త్యాలడివిజను దుర్వం తాలూక్దారులగు షేక్ హుసేన్ గారు సర్ఫెఖాన్ కుమార్చబడినారు—కాని ఇపుడు ఖాల్సాలో ఉన్నగ్రేడే ఉండును.

పాల్వంచసంస్థానములో మున్సిఫీన్యాయస్థానము ఎత్తివేయబడుటచే, ఆన్యాయస్థానము యొక్క పని సంస్థానముయొక్క జిల్లా న్యాయస్థానముచే చెరవేర్చబడును.

## పాముకాటు మంత్రము

శ్రీయుత కే. వెంకటేశ్వరరావుగారు ఇటు ప్రకటింపగోరుచున్నారు:—

ఎవరికైనను పాముకరచినపుడు కమలాకరరావుగారి పేరునుచ్చరించి, వారికి తెలియపరచెదననిమాటఇచ్చినచో, అతనికి కొద్దికాలములో నయమగును. పాముకరచినవానికి స్పృహలేనిచో, ఇతరుడెవడైనను అట్లు పేరుచ్చరించి మాటఈయవచ్చును. విషముదిగినతర్వాత ఆపాముకఱచినవాడే కమలాకరరావుగారికి తన పేరును, పాముకఱచిన తేదిని, కలిగినఫలితమును తెలియఁజేయవలెను. ఈసమాచారము తెలుపుటయందు ఆలస్యమేమియు జరుగరాదు.

పశుజంతువునకుగాని పాముకరచినచో, అదే పద్ధతి నవలంబించదగును. ఈసందర్భములో ఏ జంతువుకు పాముకరచినదియు, దానిరంగును జాబులో వ్రాసి, ఆజాబును ముందుగా ఆజంతువునకు తాకించి టప్పాలో వేయవలెను.

ఈమంత్రము తెలుపనున్న మున్నగువాటిని కూడపోగొట్టగలదు; అప్పుడుగూడ ఇదేపద్ధతిన వలంబించదగును. ఈ క్రిందివిలాసమునకు జాబువ్రాయుదగును.

"కమలాకరరావు నాయుడు గారు.
సూపర్ వైజర్, నైజాం పి.డబ్ల్యు.డి
రంగకుటీర్, మెట్టుగడ్డ,
టప్పా లాలాగూడ, దక్కన్"

## నిర్మాణశాఖలో ఉద్యోగావకాశము తక్కువ

### ముందు మొదటితరగతిలో గెలిచినవారికి మాత్రమే

నిర్మాణశాఖలో ఆఫీసర్లగ్రేడులో దొరకు ఉద్యోగములు చాలతక్కువయగుటచేతను, అకొద్దిఉద్యోగములకుదొరకు యంజనీరు గ్రాజుయేటులసంఖ్య ఎక్కువగనుండుటచేతను, అనగా ఇపుడు అవసరమైనంతకంటె నూటికి రెండింతలు ఎక్కువగానుండుటచేత, యంజినీరింగు డిగ్రీపరీక్షలో మొదటితరగతిలో ఉత్తీర్ణులగువారలుమాత్రమే ముందుకు నిర్మాణశాఖలో ఆఫీసర్లగ్రేడులో నియోగించబడుదురని ప్రభుత్వ ప్రకటనశాఖద్వారా హెచ్చరిక చేయబడినది.

### సేనాబలమును హెచ్చించుట

నజామిదళమును సంస్కరించి ఎక్కువ బలముగలదానినిగచేయుటకు ప్రభుత్వమువారు ఆజ్ఞాపించినట్లు తెలియుచున్నది.

### తాలూకాలలో మార్పులు

గుల్బర్గా తాలూకానుండి తప్రహాద్ గ్రామమును తొలగించుటకును, కళ్యాణిజాగీరులోని తక్కిమార్గన్ పల్లి గ్రామాలను బీదరుజిల్లాలోని నెల్లంగతాలూకాలో చేర్చుటకును ప్రభువుగారు ఫర్మానుజారీచేసిరి.

### ఒక వితంతూ వివాహము

[ఒకవిలేఖరి]

జనగాముతాలూకాలో చేరిన ముస్త్యాల గ్రామములో జ్యేష్ఠబ౹౹౫ శుక్రవారం సాయంత్రం ఈవివాహము జరిగెను-

వధువునివాసస్థలము ముస్త్యాల, పేరు రామిరెడ్డి సిద్దిపేటతాలూకాలో చేరిన లకడవరం అను గ్రామములో రాధమ్మ అను వితంతువుకలదు ఈరాధమ్మతండ్రియగు మల్లారెడ్డితనకుమార్తెను కొండపాక అను గ్రామం సిద్దిపేటతాలూకాలో చేరిన ఒకపిల్లవానికిచ్చివివాహము జరిపియుండెను కొని అతడుగతించెను-ఎంతలో పిల్ల యుక్తవయస్సుకురాగద్వితీయ వివాహమునకై ప్రోత్సహించతల్లిదండ్రులుఇష్టపడలేదు ఇట్లుండ యంరామిరెడ్డిఅనువతనికి ఇదివరలోనే వివాహమై భార్య కాలముచేసి యుండెను-ఇతడును అవితంతువున్ను ఒకరినొకరు గాఢముగ ప్రేమించుకొనిరి-వితంతువు తనతండ్రి అనుమతికై విచారించగా తండ్రికోపించి నిరాకరించెను-అప్పుడామె సమయమునకై వేచియుండి తల్లిదండ్రులెరుంగకుండముస్త్యాలగ్రామమువచ్చి దేవాలయములో మహావైభవముగ పై రామిరెడ్డిని వివాహమాడెను-

### హసన్కొత్తూరు

(ఒకవిలేఖరి)

మాగ్రామము ఆర్మూరుతాలూక నిజామాబాద్ జిల్లాలో చేరినది. గృహసంఖ్య(౪౦౦) జనసంఖ్య (౧౫౦౦) ఇక్కడ ౧౩౨౫ ఫసలీలో సహాయపాఠశాల స్థాపింపబడెను- అప్పటినుండిచదువుకొనువిద్యార్థులసంఖ్య(౩౫)విద్య రెండవతరగతివరకు నేర్పబడును. ఉత్తీర్ణులైనవిద్యార్థులు పిల్లలు లోకల్ఫండుబడి లేక వృథాకాలక్షేపము చేయుచున్నారుమరియు వీరలకువిద్య నేర్పించువిషయములో తాలూకాకు పంపుదమన్న ద్రవ్యసహాయములేదు. సర్కారువారు విద్యాప్రణాళిక వ్యావహారికమునందు పనిపడను లోకల్ఫండు పాఠశాల స్థాపించిన బాగుండును, దీనివిషయమై స్థానిక తహసీల్దారుగారు దౌరావచ్చినసమయము ఇక్కడి బడిపిల్లలను పరిశీలించి పేండ్ల సంఖ్య నుబట్టి: ఇక్కడ లోకలుఫండు పాఠశాలయుండవలెనని అభిప్రాయపుస్తకములో వ్రాసియున్నారు. ఇంతమంది పిల్లలకు ఒక్కఉపాధ్యాయుడు ఎటులవిద్య నేర్పగలడో విచారించతగినది. వర్షములులేకవ్యవసాయకులు ఎదిరిచూస్తున్నారు. కరువుకలుగుతుందేమో యని భయము కలుగుచున్నది.

---

## కారేపల్లి

### ప్రజాసేవకుని హత్య

వరంగలుజిల్లా హరిజనసేవక సంఘ కార్యదర్శిటులు వ్రాయుచున్నారు:—

౧౪-౭-౧౯౩౭ తేదీరాత్రి కీర్తిశేషులగు మ. రా. శ్రీపర్చూరి సీతారామచంద్రరావుగారు "పావని"యను తమస్వగ్రామమున తమ కుటీరముము అరుగుబయట నిదురించుచుండగా విరోధులచే హత్యగావింపబడిరి; వారు ప్రజాసేవాభిలాషులు. ఈప్రాంతమున ఎన్నియో సదుద్యమములు వారిచే ప్రారంభింపబడి ఇంతవరకు క్రమముగా నడుపబడుచుండెను. వారి అకాల మరణమువలన వారిచే ప్రారంభింపబడిన సదుద్యమములకు గొప్పనష్టము వాటిల్లినది, వారియందుగల అభిమానమును ప్రేమను వారిచే స్థాపించబడిన ఉద్యమములను జయప్రదముగా నడుప వారిస్నేహితులను ప్రార్థించుచున్నాను. ఈశ్వరుడు వారి ఆత్మకు శాంతినొసంగుగాత యని భగవంతుని ప్రార్థించుచున్నాము.

---

## గుబ్బి నాట్యమండలి వారి "సదారమా"

### మండలాధికారి గారికి మహారాజా బహద్దరు గారి సువర్ణపతకబహుమానము

[మా ప్రత్యేక ప్రతినిధి]

హైద్రాబాదు,జులై:-

సుమారు మాసమునిమునుపై హైద్రాబాదు గొప్పపట్టణమునందు ప్రదర్శించుచున్నను ప్రేక్షకులకుతనివితీరని కురుక్షేత్రము"అను మహాభారతఘట్టమును ప్రదర్శించిన గుబ్బి శ్రీచెన్న బసవేశ్వరస్వామి సంగీతమండలి [రిజిష్టర్డు] మైసూరువారు ౧౯౩౭జులై ౭వ తేది గురువారము "సదారమా" యను నాటకమును ప్రదర్శించిరి. ఆరోజుఎడతెగని వర్షముండినను హాలు క్రిక్కిరిసినంత ప్రేక్షకజనము దయచేయుటయేగాక మాశ్రీప్రధానామాత్యులగు మహారాజా సర్ కిషన్ ప్రసాద్బహాదరుగారును సపరివారముగా విజయముచేసి అపాంతముగ కనులారగాంచిరి. ఈనాటకమందు ప్రధానపాత్రలు [దొంగ, కోమటి]వహించిన వినోదరత్నాకర, హాస్యకళానిధి యిత్యాది బిరుదాంకితులును, మండలాధికారియునగు శ్రీయుత జి. హెచ్. వీరన్నగారు వారి తమ



పాత్రాభినయవిశేషముచే ప్రముఖులవలన పొందిన సువర్ణపతకములు సుమారు ౫౦ కిపైగానుండును వీనిని వారు తమ దొంగపాత్రధారణ సమయమందు ధరించి రంగము ప్రవేశించినంత ప్రేక్షకులెల్లరు నిర్విణ్ణులైరి. పతకములుగాక వారుపొందిన తదితరసువర్ణ, రజితబహుమానములు వేరొకచో అమర్చబడియుండుటచే మండలియొక్కఘనతను చాటుచుండినవి ఆదేరోజు మహారాజాబహద్దరుగారును శ్రీయుత జి-హెచ్. వీరన్నగారికి సువర్ణపతకబహుమానము నొసంగిరి. నిజాంరాష్ట్రాంధ్రజన సంఖ్యాధిక్యతను తెలిసికొనిరిగాబోలు వీరు ౧౯౩౭జులై౧౪వతేదిబుధవారమునుండి వారమురోజులు ఆంధ్రభాషలో "కురుక్షేత్రము"అను మహాభారత ఘట్టమును ప్రదర్శింపనున్నారు. వారికిగల ఆంధ్రాభిమానమును ఆంధ్రులెల్లరు గ్రహించి ఈ మండలిని ప్రోత్సహించుట యుపయుక్తము. ఈమండలాధికారిగారొకసందర్భమున, మేము "ఆంధ్రభాషయందే ప్రదర్శనములన్నియు జరుపలేనందుకు మాకు మిక్కిలి సంతాపముగలదు"అని సెలవిచ్చియుండిరి.

౧౯౩౭జులై౭వతేది బుధవారమునాడు హైద్రాబాదు జీవహింసనివారణసంఘ సహాయార్థమై భూమ్యాదాయ మరియు రక్షకశాఖామంత్రులగు సర్ గొ౹౹ టాస్కర్ గారి యాజమాన్యమున నొకప్రదర్శనముగావించిరి. అందువచ్చిన రూ౧౦౦లు పైసంఘమునకే ఒసంగిరి.దీనిచే వీరికి సంస్థలయెడ గల అభిమానము తేటపడుచున్నది. ఎంతటి వర్షమున్నను నాటకమున శబ్దంపకలుగకుండునట్లువీర్పాట్లును, మరియు ప్రేక్షకులకెల్లరకును వినవచ్చునట్లు రంగమందులౌడుస్పీకరు సౌకర్యమును గావించియున్నారు-ఈమండలి యొక్క ప్రాధాన్యతలను ఇదివరకే ప్రశంసించి యున్నాము.

### హరికథలు

పండరినివాసులగు నారాయణ దాసు గోల్డమెడలిస్టుగారిచే యిరువురు శైశ్యులు హరికథలు చెప్పించి సువర్ణపతకము వస్త్రములు విరాళములున్నూ సమర్పించిరి. కొందరువైశ్యులుపలువురను ప్రోత్సహించి హరికథలు చెప్పించి విరాళములుప్రోగుచేసి పై హరిదాసు గారికిసమర్పించి కృతార్థులిగా చేసిరి.

కొపర్తి యెల్లయ్యగుప్త.

---



నోటు:—గతసంచికలో "1937 జులై 24 బుధవారమునుండి తెలుగుభాషలో కురుక్షేత్రము ప్రదర్శింపబడును" అని పొరపాటున ప్రకటింపబడెను. గాన జులై 24 నకు బదులు 14 వ తేది బుధవారమని పాఠకులు తెలిసికొందురుగాక.

## సికింద్రాబాదు చందాదారులకు మనవి

మా పాఠకుల స్వార్థమై ౧౯౩౭ జూలైనెల నుండి, ఇ. నర్సింలు న్యూస్ ఏజంటు, ౧౦౮ జేమ్సుస్ట్రీటు సికింద్రాబాదు గారిని మా ఏజంటుగా నియమించియున్నాము. ఇకమీదటనుండివారిద్వారానే తమకు పత్రికలువచ్చుచుండును. వీరివద్ద ఎక్స్ట్రా కాపీలుకూడా దొరకును. చందాదారులుకోరినచో వీరికి చందాచెల్లించి రశీదు పొందవచ్చును. మాచే ప్రచురింపబడిన గ్రంథములుకూడా లభించును.

మేనేజరు
గోలకొండపత్రిక.

గోలకొండ పత్రిక

ఈశ్వరనామ సం॥ ర ఆషాఢ శు॥ ౫

సోమవారము

## మైసూరాంధ్రుల దుర్గతి

ఈనాటిమాటకాదు. గోలకొండ సుల్తానుల రాజ్యారంభకాలమునుండియే ఆంధ్రులదుర్గతి ప్రారంభించినది. అయినను గోలకొండ పాదుషాలు ఇతర సుల్తానులకన్న మేలైనవారేయని చరిత్ర తెల్పుచుండినను ఆంధ్రులకు పరాధీనత యుండనేయుండెను కదా! విజయనగర సామ్రాజ్యము తల్లికోటలో యెన్నడు రూపుమాసెనో ఆనాటినుండి ఆంధ్రుల దుర్గతి పూర్తిగా స్థిరపడిపోయెను.

ఆంధ్రభాషయు తల్లికోట యుద్ధానంతరము క్షీణించుచువచ్చెను. తదనంతరము ఉత్కృష్టకావ్యములు పేరునకుగూడ దొరకుట దుర్లభమయ్యెను. ఆంధ్రదేశములో విశేషభాగము నిజాం సర్కారుక్రిందికివచ్చెను. మధ్యకాలములో ఉత్తరసర్కారులు, గుంటూరు, రాయలసీమ విడిపోయెను. ఇప్పుడు నిజామురాష్ట్రములో ౭౦ లక్షల ఆంధ్రులున్నారు. మన రహబరెదక్కన్ దినపత్రిక వ్రాతలే ప్రమాణములైనఈరాష్ట్రములో ఆంధ్రభాషకేకాక కన్నడీ మహారాష్ట్రభాషలకుకూడ ఆదరణ యుండదు ఉర్దూతప్పతక్కినభాషలన్నింటిని (ఉఖ్బజబానా) పాతాళానికి అణగద్రొక్కవలెనని రహబరెదక్కన్ ఆరేడేండ్లక్రిందటనేవ్రాసియుండెను. మరియు ఈరెండుమూడేండ్లనుండి ఆంధ్రవాదులుఆ రహబరెదక్కన్ పత్రికకు గిట్టనేగిట్టనట్లున్నది. ఏదో యొక తప్పుకల్పించి తీవ్రముగా విమర్శించుట ప్రధానోద్దేశముగా నేర్పాటుచేసుకొని నట్లున్నది. ఆంధ్రమహాసభపై వరుసగా ఎన్నియో సంపాదకీయముల్వ్రాసెను. కర్ణాటక మహాసభ జరిగినప్పుడును ఆంధ్రుల నంస్మరించెను మహారాష్ట్రమహాసభ జరిగినప్పుడునుఆంధ్రులనే స్మరించెను. ఆంధ్రులెంతపాపము జేసినారో యేమో జవాబిచ్చుకొనుసామర్థ్యముగూడ కోలుపోయినారు.

పరిస్థితులిట్లుండ మైసూరురాజ్యములోని ఆంధ్రులగతి కుక్కలగతిగా నున్నట్లు కనబడుచున్నది. మైసూరాంధ్రులు నిజామాంధ్రులవలెనే ఆంధ్ర భూభాగమునకు చేరినవారేకాని ఆంధ్రమూలవృక్షమునుండి చీలిపోయిన శాఖవారుకారు. బ్రిటిషిండియాలో నిజామాంధ్రులను మైసూరాంధ్రులను వలసపోయినవారినిగా లేక రాష్ట్రేతరాంధ్రులనుగా కొందరు పరిగణించుట వాడుకయైపోయినట్లున్నది. అది తప్పు. ఒకవేళ ఖడగ్‌పూరు, బొంబాయి, బర్మా ఆంధ్రులను వలసపోయినవారినిగా చెప్పిన చెప్పవచ్చును. కాని నిజాం మైసూరు సంస్థానములలోని ఆంధ్రభాగములు బ్రిటిషాంధ్రభాగమునే అంటియుండి రాజకీయముగా భిన్న భిన్నప్రభుత్వములకు లోనైనవేకాని అన్యముకాదు.

మైసూరు సంస్థానములోని కొన్ని అంకెల నిందుదహరించి అచ్చటిపరిస్థితులను చూపించుచున్నాము.

| | |
|---|---|
| మొత్తము రాష్ట్రములో నిజనసంఖ్య | ౬౫,౫౭,౦౦౦ |
| అందు:— | |
| కర్ణాటకులు ......... | ౪౫,౬౯,౦౦౦ |
| ఆంధ్రులు ......... | ౧౦,౩౧,౦౦౦ |
| మహమ్మదీయులు ... | ౩,౮౩,౦౦౦ |
| తమిళులు ......... | ౩,౧౪,౦౦౦ |
| మరాటీలు ......... | ౯౧,౦౦౦ |

అనగా ఆంధ్రులు జనసంఖ్యనుబట్టి రెండవస్థానము వహించుచున్నారు. అనగా మైసూరు మహారాజుగారు కేవలము కర్ణాటక రాజులేకాదు. పూర్వవిజయనగర సామ్రాజ్య సిల్సిలావారును అగుటచేత ఆంధ్ర కర్ణాటకరాజులు మరియు ఉర్దూమాట్లాడువారు మూడవస్థానము వహించుచున్నారు. అనగా ఆంధ్రులలో సుమారు మూడవ వంతు మాత్రమే యున్నారన్నమాట. ఈపది లక్షల చిల్లరసంఖ్యాకులగు ఆంధ్రులలో విశేషభాగము కోలారుజిల్లాలో నున్నారు. అందు ౪,౩౧,౦౦౦ ఆంధ్రులును, ౫౭౦౦౦ ఉర్దూమాట్లాడువారును నున్నారు. కొన్ని తాలూకాలలో ఆంధ్రులసంఖ్య విశేషముగా నున్నది. ౧౦ వేలకుమించిన ఆంధ్రులసంఖ్యగల తాలూకాలు మైసూరురాష్ట్రములో ౧౩ కలవు. అందు ౧౫౦౦౦ ఆంధ్రులకు మించిన జనసంఖ్యగల తాలూకాలను మాత్రమే యిందు చూపుచున్నాము:

| తాలూకా | ఆంధ్రులసంఖ్య |
|---|---|
| మధుగిరి | ౩౨౭౮౨ |
| బెంగుళూరు | ౪౫౮౨౩ |
| దొడ్డబళ్లాపూరు | ౨౨౦౫౮ |
| హొసకోట | ౨౬౪౫౪ |
| దేవనహళ్లి | ౨౪౭౨౩ |
| చితల్‌దుర్గ | ౨౧౬౫౮ |
| చల్లకేరి | ౩౭౬౯౩ |
| మొలకలమూరు | ౧౬౭౮౨ |

ఈ తాలూకాలన్నియు మైసూరుకు ఉత్తరమునను, తూర్పునను అనగా అనంతపురం, చిత్తూరు, ఆర్కాటు జిల్లాలనానుకొనియున్నవి.

ఇట్లాంధ్రులు రెండవస్థానమువహించినను మైసూరు ప్రభుత్వమువారు చేయుచున్న నిరాదరణ విపరీతముగానున్నది. ఆంధ్రులవిద్యకై మాతృభాషలో క్రీ. శ. ౧౯౩౪ వరకు నొక పాఠశాలకూడ లేదనిన ఎంతటి కఠినసమస్య యేర్పడినదో యూహించుడు. కోలారు జిల్లా యించుమించు ఆంధ్రజిల్లాయనియే యూహించవచ్చును. అయినను ఆజిల్లాలో ఒకగ్రామములోనైనను ఒక్కపాఠశాలయైనను తుదకొక్క ప్రాథమికపాఠశాలయైనను ఆంధ్రభాషలో లేదుకదా! అయతే ఆజిల్లాలోని ఆంధ్రులలో ౧౦ వ వంతు మాత్రమేడున్న మహమ్మదీయులకై ఆజిల్లాలో ౧౪౦ ప్రాథమికపాఠశాలలున్నవి. అనగా ప్రతిశతి ౪౦౦ మందికొకబడిచొప్పున ఏర్పాటులున్నవి.

౪౦౦ మందికొకబడివంతున నుండుట ౪ లక్షలమందికిఒక్కబడి కూడ లేకపోవుట ఇదియే ఆశ్చర్యములో నాశ్చర్యము!!

ఇంకను విచిత్రములను జూడుడు. ఈక్రింది అంకెలలోనే మైసూరురాజ్యభాషాచరిత్ర ఇమిడియున్నది. క్రీ. శ. ౧౯౩౫ సం॥ మైసూరు విద్యాశాఖ రిపోర్టుప్రకారమిట్లున్నది.

రాష్ట్రములోని మొత్తము ప్రాథమిక పాఠశాలలు ౬౨౫౦

వానివివరము లిట్లున్నవి:—

| | |
|---|---|
| ౫౦౯౬ | కన్నడము |
| ౬౨౨ | ఉర్దూ |
| ౭ | తెనుగు |
| ౯ | అరవము |
| ౧ | మరాటీ |
| ౫౧౫ | బాలికా పాఠశాలలు (కన్నడము ఉర్దూ) |

ఇందు గమనింపవలసిన దేమన ౧౯౨౪ వం సంవత్సరమువరకు తెనుగు బళ్లు కనబడవు. ౧౯౩౫ లో ౭ బళ్లు ఏర్పాటుచేసినారు. కాని ౬౨౨ ఉర్దూబళ్ళున్నవి. ఉర్దూవారికన్న తక్కువసంఖ్యలోనుండు అరవవారికి తొమ్మిది బళ్ళున్నవి.

ముసల్మానులకుగాను రాష్ట్రములో ౮౮౩ ప్రత్యేకపాఠశాలలు ఏర్పాటుచేసినారు. బాలికలకును ప్రత్యేక ఉర్దూపాఠశాలలుకలవు. "మారాష్ట్రభాష కన్నడము. అందరును కన్నడము చదువుడు, చదువకుండిన మీకొక చిల్లిగవ్వకూడ సహాయముచేయము" అని మైసూరు ప్రభుత్వమువారనలేదు. పాపము! ఎంతో అభిమానముతో ఉర్దూపాఠశాలలేర్పాటుచేసి ఒక ముసల్మాను స్త్రీని (Inspectress) బళ్ళ విచారణకై ఏర్పాటుచేసినారు. మరియు విద్యాశాఖలో సుల్తాను మొహియొద్దీన్ అను వారిని డెపుటీ డైరెక్టరుగా(నాయబు నాజింగా) ఏర్పాటుచేసినారు. ఇంతయాదరణ ముసల్మానులయెడ చూపించుటయెందులకు. ఆంధ్రులయెడ (వారు పైవారికన్న మూడంతల సంఖ్యగలవారైనను) రవ్వంతయు ఆదరణ చూపింపకపోవుటెందులకు? ఒకే కారణముగ పడుచున్నది. ముసల్మానులకు నోరున్నది. ఆంధ్రులకు నోరుచచ్చినది

ఇక మైసూరురాష్ట్రములో మాధ్యమికపాఠశాలలగురించిన యీక్రింది వివరములు ౧౯౩౫ సం॥ విద్యానివేదిక నుండియుదహరించుచున్నాము.

రాష్ట్రమంతటను మాధ్యమిక పాఠశాలలు ౨౯౩

అందు:—

| | |
|---|---|
| కన్నడము | ౨౫౯ |
| ఉర్దూ | ౩౦ |
| తమిళం | ౩ |
| ఇంగ్లీషు | ౧ |

ఒక్క తెనుగుమాధ్యమికపాఠశాల కూడ లేదు! కాని చిత్రమేమనగా మహమ్మదీయులకు (ఆంధ్రులలోమూడవవంతు సంఖ్యవారికి) ౩౦ బళ్లున్ను వారికన్నను తక్కువ సంఖ్యగల తమిళులకు మూడుబళ్ళును కలవు. కాని దిక్కులేని తెనుగునెవరు విచారింతురు. అయితే ౪౦ ఉన్నత పాఠశాలలలో ౩ ఉన్నతపాఠశాలలలో తెనుగుబాలురకు ద్వితీయభాషగా ఏర్పాటుచేసియున్నారని యుకొన్ని కాలేజీలలో తెనుగు ద్వితీయభాషగా ఏర్పాటుచేసియున్నారనియు వినుచున్నాము కాని మైసూరు ప్రభుత్వమువారి ౧౯౩౬ వ సం॥పు నివేదికలో గాని ౧౯౩౫ వ సం॥ విద్యానివేదికలోగాని యీవివరాలేమియు కానరావు. నిజమేయైనను ఈ పద్ధతినే ఆకాశహర్మ్య నిర్మాణమందురు. పునాదిలేదు, గోడలులేవు, కప్పుమాత్రము ఏర్పాటైనది. ప్రాథమికతరగతులందు తెనుగు ఏదుబళ్ళలో. మాధ్యమికశాఖలలో తెనుగులేనేలేదు. ఉన్నత పాఠశాలలలో ౩ తావులందే. ఇక కాలేజీలలో ఓనమాలు మొదలుపెట్టవలెనా లేక వసుచరిత్ర చదువవలెనా

మైసూరు రాష్ట్రములో ఇంకొక విశేషముకూడ కలదు. ముసల్మాను బాలికలకు ప్రత్యేకముగా బళ్ళుఏర్పాటు చేసినారు. కాని ఆంధ్రబాలికలకు లేకున్నమానె ఆంధ్ర బాలురకైనను మహమ్మదీయుల కేర్పాటైన బళ్ళ మాత్రమైన ఏర్పాటుచేయుటకష్టమా? మైసూరురాష్ట్రములో ఆంధ్రులుపన్నులే యిచ్చుటలేదా? లేక ఆంధ్రులందరు బిచ్చగాండ్రేనా?

అస్సలు రహస్యమేమన ఆంధ్రులెచ్చటనైననుసరేనెమ్మదిసరకు. ఆందోళన చేయువారు కారు. కష్టములను పూర్తిగా సహించువారు కానిఅడుగనిది అమ్మైనా పెట్టదు.

౭ వ పేజీ చూడుము

## మ. ఘ. వ. నిజాం సంస్థానపు రైల్వే

విద్యార్థుల సంచారములకుగాను ఛార్జీలలో ఆకర్షకములగు తగ్గింపులు

యం.యస్.యం.,యస్.ఐ., మరియుమైసూరురైల్వే కంపెనీలతో కలిసి, విద్యార్థుల ప్రచారమునకై ప్రత్యేకముగ తగ్గింపుఛార్జీలను ఏర్పాటు చేసినాము.

తగ్గింపుఛార్జీలలో ముప్పది నిండుటిక్కెట్లకు సరిపోవునంత మంది ఇప్పుడు దక్షిణ హిందూదేశములోని నాలుగు పెద్ద రైల్వేలలో (యమ్- యస్- ఆర్., మైసూర్, యం. యస్. యం-, యస్. ఐ. రైల్వేలు—నీలగిరి రైల్వే కూడ లెక్కలో చేరును, కాని షోరాణ్పూరు- నీలాంబుర్ రైల్వే చేరదు) మొదటి రెండవ తరగతులలో సగము ఛార్జితోను, ఇంటర్ తరగతిలో మూడవ తరగతి మెయిలుఛార్జితోను, మూడవతరగతిలో మూడవతరగతి మెయిలులో ఛార్జిలో సగముతోను ప్రయాణము చేయవచ్చును. ఇంతేగాక విద్యార్థులు ప్రయాణము చేయు తరగతి పెట్టెలోనే ముప్పదినిండు తగ్గింపుఛార్జీటిక్కెట్లకుసరిపోవునంతమంది విద్యార్థుల జట్టుఒక్కొక్కదానితోను ఒకప్రొఫెసర్ లేక ఉపాధ్యాయుడుప్రయాణము చేయవచ్చును.

ప్రతిజట్టులోను, ఒకే బడిలో చదువు విద్యార్థులు, పిల్లలైనను, లేక వేర్వేరుబళ్లలో చదువువారలైనను ఉండవచ్చును. కాని వారలు ఒకటే రైలుబండిలో కలిసియుండవలెను. అయినను ఒకటే తరగతి పెట్టెలో నుండవలెనని నిర్బంధము లేదు.

మొదటి, రెండవతరగతి ప్రయాణికునికి ఒక్కొక్కనికి ఒక్కొక్కవరుపు వంతునను, ఇంటరుతరగతిలో ప్రతిప్రయాణికునికి ఒక్కొక్క సీటు వంతునను. మూడవతరగతిలో ప్రతిపెద్దవానికి రెండుసీట్లు, ౧౨వండ్లలోపలనుండు ప్రతివానికి ఒక్కసీటువంతునను రైల్వేవారు ఏర్పాటు చేసెదరు.

ఈతగ్గింపుఛార్జిటిక్కెట్టు మైసూరు రైల్వేలలో బెంగుళూరు- మైసూరు శాఖలోదప్ప తక్కినశాఖలబండ్లకును మెయిలులో దొరకును.

ఇంటర్ తరగతిలో తగ్గింపు యస్. ఐ, మరియు మైసూరురైల్వేలలో దొరకదు. యస్-యస్. రైల్వేలలో బెజవాడ— బల్హార్షా శాఖపై గ్రాండ్ట్రంక్ యక్స్ప్రెస్‌లో ఇంటర్ తరగతియందు తగ్గింపుఛార్జి లభించును.

ఇతర వివరములకు ఈక్రిందివారికివ్రాసి కనుగొనుడు:—

చీఫుకమర్షియల్ మేనేజర్.
యమ్, యస్, రైల్వే,
శికిందరాబాదు (దక్కన్)



## ప్రభుప్రేమ

బొంబాయినుండి వెలువడు "తుఫాన్" పత్రికయొక్క ౨౭జూన్ ౧౯౩౭ తేది సంచికయందు దీనికి హైద్రాబాదయందు ప్రచారముగలదు) ప్రకటితమైన వ్యాసమొకటి ఆక్షేపణీయముగా గలదనవచ్చును. కాని ప్రస్తుతస్థితియందా పత్రికా సంపాదకులును (హైద్రాబాదయందు నివసించుచున్నారు) నగర రక్షకశాఖ నుండి ;పూర్వపుప్రవర్తన దెలుపుచు (మాప్రభుత్వ మిదివరకే మందలించినది) ముందిక నిట్టియనవసర విషయములందు జోక్యము కలిగించుకొనకుండుటకు మందలించుట యుక్తమని భావింప బడినది. ఒకవేళ ముందీస్థితియే యుండిన అప్పటిపరిస్థితుల ననుసరించి తగుచర్య గైకొనబడును.

"ఇతరుల కంటిలోని నలుసు చూడగలవు గాని నీ కంటిలోని దూలము గానలేవ" నెడు లోకోక్తి యిట్టి క్రియాచరణుల కెటుల బోధ పడగలదు—

## భూసంరక్షణ శాసనము

బహుకాలమునుండి ప్రభుత్వాలోచనయందుండిన వ్యవసాయయోగ్య భూసంరక్షణ విషయముపై ప్రభువుగారిదృష్టి ప్రసరితమగుట చేతనంటనే సంరక్షణోపాయమును అవలంబింపుట కాజ్ఞయొసగుచు "వ్యవసాయరైతులు నేటివిపత్తులనుండి విముక్తులైన సంతసించెదన"ని ఫర్మాను ప్రకటించిరి.

వ్యవసాయ వర్గాధీనభూములు సాహుకారులయాస్తిగా మారుచున్నటుల కొన్ని సంవత్సరముల విచారణలవలన వెల్లడపడుచున్నటుల ఫర్మాన విశదపరచుచున్నది. ఇంతేగాక రైతులయవివేకమో లేక వ్యవసాయకుల వధోగతిపాలుజేయుచున్న సాహుకారులందు కలిగిన భూమ్యాధిపత్యభిలాషయో కారణములనుట నిశ్చయము. ఆర్థికమాంద్యముచే గత రెండు సంవత్సరములనుండి సంభవించుచున్న విపత్తులవలన ప్రపంచమందలి వ్యవసాయకులందరు కష్టములపాలగుచున్నారు. నానాటికి ధాన్యపుధరలు తగ్గిపోయినవి. నా వ్యవసాయక రైతులుసహిత మిట్టివిపత్తునకు గురియైరి. కాబట్టి వెంటనే తగుపద్ధతులవలంబించి నావ్యవసాయకుల కష్టములనుండి విముక్తులజేయుట నాకత్యవసరముగా దోచుచున్నద"ని గలదు.

ప్రభువుగారి ఫర్మానుననుసరించి అప్పులపాలైన వ్యవసాయకుల, వారిభూముల సంరక్షించుట కొకశాసనము ప్రభుత్వము సిద్ధపరచినది. శాసన ప్రకటనపూర్వము అచరణఫలితముల పరీక్షించుటకు మహారాష్ట్రమందలి నాందేడు, ఉస్మానాబాద జిల్లాలను నిర్ణయించెను. ఆప్రాంతమందలి వ్యవసాయకులప్పులపాలైకష్టములకు గురియైయున్నారు. ఇతరప్రాంతములందు దీనియాచరణప్రవేశపెట్టుటకు "భూసంరక్షణము అప్పులపాలైన వ్యవసాయకులముక్తి" కొరకొక చిత్తుశాసనము, అతిసరళ సుపకరణలతో శాసనపద్ధయందు ప్రభుత్వము ప్రవేశపెట్టెను.

వ్యవసాయభూములలో ప్రతిశతి ౨౫ సాహుకారుల హస్తగతమైనటుల పై జిల్లాల పరీక్షలవలన దేటపడినది. తక్షణమే రక్షణోపాయము అవలంబించకుండిన వ్యవసాయవృత్తిగల రైతులకు ఘోరవిపత్తు సంభవించ నున్నటుల గోచరమైనది.

ప్రభుత్వమిట్టిభయంకర ఘోరసమస్యను... నిశ్చలముగా నెదుర్కొనుటకు సంసిద్ధపడినది. అనతికాలములో భూముల తాకట్టుపెట్ట బడు ప్రభుత్వపు బ్యాంకులు స్థాపితములు కానున్నవని దెలియుచున్నది.

—

౭ వ పేజి తరువాయి

బ్రిటిషు ఆంధ్రులు ఆంధ్రమహాసభలో ౨ ఏండ్లక్రిందట మైసూరు ఆంధ్రులపరిస్థితులు కనుగొనుటకై ఒక ఉపసంఘమును ఏర్పాటు చేసియుండిరి. ఆ యుపసంఘమువారు ఇంతవరకు సమావేశమైనట్లే తోచదు. మనలో ఇదియు నొకలోపము. తీర్మానాలు చేయుదుముకాని కార్యాచరణమాత్ర ముండదు. కావున ఇకైనను ఉపసంఘమువారుఆలస్యముచేయక మైసూరు ఆంధ్రప్రాంతములలోతిరిగి విచారణలు చేసి తమనివేదికనుసిద్ధపరచి మైసూరు ప్రభుత్వముతో మొరపెట్టుకొని తమ సోదరుల న్యాయ మైన హక్కులకై ఆందోళనముచేసి దినదినముఅన్యభాషావాసులై మాతృభాషనుమరచి ఉభయభ్రష్టులై విద్యా విహీనులై క్షీణించుచుండిన పది పదకొండులక్షల ఆంధ్రుల నుద్ధరింతురని గోరుచున్నాము.

—

# కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరింతురు

### కాంగ్రెసు కార్యకారిణీసభవారి వార్ధా తీర్మానము

## మరల గాంధిమహాత్ముని విజయము

అందరుఎదురుచూచుచున్న వార్ధాకాంగ్రెసు కార్యకారిణీసంఘసమావేశము ౫ జూలైనాటిఉదయము ౧౧గం.లకు ప్రారంభమై, ౭జూలైనాటిమధ్యాహ్నము ముగిసినది. ఈసమావేశము జమ్నలాల్ బజాజుగారి బంగళాలో జరిగెను. ఇరువురుసభ్యులుమాత్రమే రాలేదు. మొదటిరోజు మూడుగంటలకాలము సభవారాలోచించి సాధారణముగా ఆమోదమునకై వచ్చుచుండువిషయములను పరిష్కరించివేసిరి- కాని వైస్రాయిగారి రాజ్యాంగసంబంధమగు ప్రకటనతర్వాత కాంగ్రెసువారలు మంత్రిపదవులను స్వీకరించుటయా, స్వీకరించకుండుటయా య



నవిషయమును చర్చించుటకు గాంధి మహాత్ముడుండుట మంచిదనితలచుటచేతను, ఆరోజు గాంధిగారు మౌనవ్రతధారియై యుండుటచేతను, ఆనాటిచర్చ అంతటితో ముగిసెను.

మరునాడుఉదయము ౮ గం.ల నుండి ౧౧ గం.లవరకు మంత్రిపదవుల స్వీకరణను గూర్చియే చర్చలుజరిగెను. గాంధిమహాత్ముడు సరిగా సకాలమునకువచ్చియుండి పరిస్థితులను కర్తవ్యమునుగూర్చి విశదముగాసభవారికి బోధపరిచెను- అంతటచర్చజరిగెను- ఆనాడు ఎటుగూడ తీర్మానముకాలేదు. మధ్యాహ్నము ౧ గంటభోజనవిరామముదప్ప మరియేవిరామముగాని లేకుండెను. సాయంకాలము ౫ గం.లవేళ శాసనసభలందలి కాంగ్రెసుపక్షముల నాయకులు పిలిపించబడి, సొంతఅభిప్రాయములను, స్వపక్షసభ్యుల అభిప్రాయములను తెలుపవలసినదిగ కోరబడిరి- ఆరుగురు నాయకులలో అయిదుగురు, సి. రాజగోపాలాచారి, పండిత్ గోవిందవల్లభపంతు, డాక్టర్ ఖారే, బి.జి. ఖేర్, విశ్వనాథ్ దాస్ గారలు మంత్రిపదవులను స్వీకరించు మంచిదని సకారణముగచెప్పిరి. అంత ౮ గం.లగుటచే సభముగించుచు ఆకౌనసభా పక్షనాయకులను మరునాడు మధ్యాహ్నము ౨ గం.లవేళ పిలిచినచో వచ్చుటకుసిద్ధముగ నుండ కోరబడిరి. రాత్రిభోజనము తర్వాత, మరల సభవారు సమావేశమై రాత్రి ౧౦౹గంటలవరకు చర్చించిరట.

మరల జూలై ౭వతేది బుధవారము నాటి ఉదయము ౮ గం.లకు సభవారు సమావేశమైసాయంకాలమువరకు చర్చించి శాసనసభలలో కాంగ్రెసు పక్షనాయకులగు మంత్రివర్గముల నేర్పరచుటకు గవర్నర్లుపిలిపించుచో పోయి మంత్రిపదములను స్వీకరించవచ్చునని తీర్మానము చేసిరి- ఈతీర్మానము చాల పొడవుగనున్నది-కాని అందులో దాదాపు మొదటిపాతికకు పైబడినభాగమంతయు ఢిల్లిలోమార్చి ౧౭వతేదినాడు ఒకషరతుపై కాంగ్రెసువారలు మంత్రిపదవులను స్వీకరించవచ్చునని కాంగ్రెసు స్థాయిసంఘమువారు తీర్మానించినది మొదలుకొని జరిగినపరిస్థితులను సింహావలోకనముచేసి, "సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫార్ ఇండియా"గారి: అండర్ సెక్రెటరీ, వైస్రాయి గారలు చేసినప్రకటనములపై అభిప్రాయ మొసగినది- ఆ ప్రకటనలు కాంగ్రెసుకోరినదానిని తీర్చుటకు అభిలాషయున్నట్లు తోచజేయుచున్నను, కాంగ్రెసు స్థాయిసంఘమువారి తీర్మానములో కోరబడినదానినిచ్చుటలేదని ఇపుడు అభిప్రాయము తేల్చబడెను- బ్రిటిషువారును భారతీయులును సరిసమానభాగస్వాములని బ్రిటిషు రాజకీయ నాయకులు చెప్పుమాటలుఅంగీకరించదగనివనుచు కాంగ్రెసు కార్యకారిణీసంఘమువారు ఇప్పటిస్థితిలో బ్రిటిషువారు భారతదేశ పరిపాలనమును స్వార్థమె ప్రధానముగచూచుకొనుచు చేయుచున్నారని చెప్పుట సత్యమనిరి- కాని శాసనసభలలోని కాంగ్రెసు నాయకులు మంత్రివర్గముల నేర్పరుచ నిరాకరించనప్పటినుండి ఇంతవరకుఏర్పడి పరిణమించియున్న పరిస్థితులలో గవర్నర్లు తమ ప్రత్యేకాధికారముల నుపయోగించుట సులభమైనపనికాదని కార్యకారిణీసంఘమువారు అభిప్రాయపడి, కాంగ్రెసువారు మంత్రివర్గములను ఏర్పరుచుటకుసమ్మతించిరి- ఈ సమ్మతికిప్రేమించిన ఇంకొకకారణము శాసనసభలలో కాంగ్రెసుసభ్యుల అభిప్రాయములును, సామాన్యముగా కాంగ్రెసువారల అభిప్రాయముకూడ అయియున్నట్లు తీర్మానములోచెప్పబడినది- కాని మంత్రిపదవులస్వీకరించి ఎన్నికలలోచేయబడిన వాగ్దానప్రణాళిక ప్రకారము రాజ్యాంగము నమలుపరచవలెననియు, సాధ్యమైనన్ని విధముల నూతనరాజ్యాంగమును నిలువనీయకుండ పోరాడుచుండవలెననియు, ఇంకొకవైపు నిర్మాణకార్యక్రమము నిర్వహించుచుండవలెననియు తీర్మానించబడినది-

ఈతీర్మానమును కాంగ్రెసు స్థాయిసంఘమువారేచేయవలసియుండెను వెంటనే స్థాయిసంఘమును సమగ్రముగ సమావేశపరచుట సాధ్యముకావందువల్లను, ప్రస్తుతపరిస్థితులలో వెంటనేమంత్రిపదవీ స్వీకరణసమస్యనాలోచించి తేల్చుట ముఖ్యావసరమగుటచేతను, తీర్మానమును వెంటనే చేయవలసివచ్చినదని తీర్మానమందుస్పష్టపరచి, ఈతీర్మానము ఢిల్లీకాంగ్రెసు స్థాయిసంఘమువారుచేసిన తీర్మానమున కనుకూలముగ నున్నదిగనుక స్థాయిసంఘమువారు దీనినామోదింతురని ఆశించబడెను-

ఈతీర్మానము ఏకగ్రీవముగ, ఆమోదించబడినవెంటనే, కొంతవర్షముకురియుచున్నను గాంధిమహాత్ముడు సభనుండిలేచి సెగాం గ్రామమునకు బయలుదేరిపోయెను; వారివెంట సి. రాజగోపాలాచారిగారుకూడలేచిపోయిరి-

తర్వాత కార్యకారిణీసంఘము రాత్రి ౧౦ గం.లకు సభముగించి, మరునాడు ఉదయము ౧౧గం.లకు సమావేశమై మధ్యాహ్నమువరకు సాధారణ విషయములను చర్చించిముగించిరి. బొంబాయిలో కాంగ్రెసు పక్షనాయకులుగ ఖేరుగారుఎన్నుకొనబడుట న్యాయముకాదనియు, వారిమేక్ గారే నాయకులుగ నుండవలెననియు పత్రికలలోను సభలలోను చేయబడిన ఆందోళన విషయములో నారిమెక్ గారినడుగ ఇదివరకు కార్యకారిణీసంఘమువారు చేసిన తీర్పు తమకుసమ్మతమనిరి- అది అంగీకరించబడెను-

---

### విద్యార్థినీ వేతనములు

హైదరాబాదు రెడ్డిజనసంఘమువారు రెడ్డి బాలికల వసతిగృహములోనుండి బాలికల ఉన్నతపాఠశాలలలో విద్యనభ్యసించు నీక్రింది విద్యార్థినులకు విద్యార్థినీవేతనమీయనంగీకరించిరి.

కమల ౪వ ఫారం రు౧౦-౦-౦లు
సత్యమ్మ ౩వతరగతి ౬-౦-౦
అండాళ్లు మూడవఫారం ౪-౦-౦
మొత్తము ౨౦-౦-౦

---

## పాలనుండి పట్టు?

## ఒక నూతన రహస్యము

౪౧ సంవత్సరముల ప్రాయముగలిగిన శేఖ్ అమిత్ రాస్ యను నొక జర్మను రసాయని కు డీటీవలన యింగ్లాండుయందు పాలనుండి పట్టు తయారుచేసి ప్రపంచ వైజ్ఞానికుల విస్మయపరచెను. ఈతడు సుమారు ౧౦ సంవత్సరములనుండి నిరంతరముగా తన పరిశోధనాలయముందు తనప్రయత్నమును సాగించి నేడు చక్కనిరంగులు గలిగిన సున్నితమగు పట్టును పాలనుండి సిద్ధపరచి చాలావరకు సఫలుడయ్యెను.

క్రీ ౧౯౩౧ సంవత్సరమున తాను పరిశోధనాలయమునందు సిద్ధపరచిన కృత్రిమపట్టును, సహజమగు, అనగా కీటకములనుండి తీయఁబడిన పట్టును కలిపి బర్లిన్‌నగరమందలి పృథక్కరణాలయమునకు పరీక్షార్థము బంప అచ్చటి పరిశోధకులు పృథక్కరణ మొనర్పుటయందు విఫలులై. 'విడదీయుటసంభవ'మని విశదపరచిరి.

ఈతడింతవరకు సుమారు 3 లక్షల రూప్యములు పరిశోధనకై వెచ్చించినను తృప్తిజెందక తనపరిశోధనను మరింత తీవ్రతతో సాగించుచు దానియందుండిన లోపమును పూర్తిగా కనుగొనుటకు కృషిసలుపుచుండుట అతనిపట్టుదల పూర్తిగా విశదమగుచున్నది. కాని యుత్తమ పట్టులక్షణముల రహస్యమీతనికి తన పట్టుయందింకను పట్టుబడకున్నది

వర్ణసౌందర్యము, పటుత్వము, మృదుత్వము స్థితిస్థాపకత్వము, మకళరహితత్వము మొదలగు ప్రాధాన్యాంశములు తన పటుయందు గలిగితీరవని యూహించుచున్నాడు. ప్రస్తుత మీతనిచే తయారుచేయబడిన పట్టుయందు నాలుగులక్షణములు విశదమగుచున్నను పరిపూర్ణాంశము మాత్రము లోపించుచునేయున్నది

పరిశోధనయం డీటీవల యవలంబించిన పద్ధతివలన కొంతసాఫల్యత చేకూరినదనవచ్చును.

పట్టు కీటకములకు ముఖ్యాహారము కంబళిరేక పూతికపండ్ల చెట్లాకులు. రెండు మంచిఆవులకు వీనియాకుల నేమేపి వానితో సమానమగుపట్టును తయారుచేసితీరెదనని యీతని ప్రయత్నము.

"ఆరోగ్యవంతములైన రెండుఆవులనే రుకొని నారమురోజులవరకు వాని సహజాహారముపై మేపుచుందును. అపై వానిపాలను పరీక్షించెద; దానియందలి వెన్నను పరీక్షించెద; మీగడదీసినపాల విరుగును పరీక్షించి చూచెద. నాపృథక్కరణ పట్టుకీపాలవిరుగుడే ముడిపదార్థము."

"అపై వీనిమేతయందు కొంత కంబళియాకు కలిపి వీనినిమేపి అపైన పాలు, వెన్న పాలవిరుగుల పరీక్షించెద. ఆటుతర్వాత మూడువారములవఱకు పూర్తిగా కంబళిఆకులనేమేపి పైయంశములను పరీక్షించిచూచెద.

"కంబళియాకుల మేసిన ఆవుపాలనుండి పాలవిరుగుడు నాపట్టుపరిశ్రమకు తదితరములకన్న మిగుల సాయకారిగా దేలినదానిని రసాయనిక పృథక్కరణమొనర్చి మూడింటియందలి భేదాంశముల రహస్యము కనుగొనుటకు ప్రయత్నించెద.

"ఈవిభేదపు రసాయనికాంశములు నిర్ణీతములైన పరిశోధనాలయమునందే విభేదోత్పత్తితో స్వాభావికమగు పాలవిరుగుడును అభివృద్ధిపరచుమార్గములు సంభవమగుననుట నిశ్చయమని రాస్ విశదపరచెను.

ప్రస్తుతము రాషుగారికి అవసరమున్న ఆవులు, తత్సంబంధపు పరికరము లందింపబడినను కంబళిఆకుల అవసరమింకను పూర్తిగాకుండుచున్నది.

ప్రతిరోజు పితుకబడే యొకసామాన్యమగు ఆవువలన అర్థశేరు [౩౨ తులములు] పృథక్కరణ మగు పట్టు తయారుచేయుగలుగు పాలవిరుగుడు లభించుచుండును. ఇది పాలనుండి వెన్నదీసినపిదపనే.

చక్కగా చుట్టిన ఆరుతులముల పట్టుదారము లభించుటకు ౩౦ వేల పట్టుకీటకములకు నొకటన్ను [అనగా ౧౦ పల్లాలు] కంబళిఆకు ఆహారమత్యవసరమనుమాట జ్ఞప్తియందుంచుకొనతగినది.

రాస్ గారి ప్రయత్నములు విజయవంతములైన పట్టు చౌకగునో లేక పాలు ప్రియమగునో తెలియుటలేదు.

## ప్రజాభ్యుదయమునకు వాక్, రచనాస్వాతంత్ర్యము లత్యవసరములు

ప్రజాసేవకుల కొక హితవు

రైల్వే కార్మికసంఘాధ్యక్షులగు ఫతేవుల్లాఖాన్ గారు అక్బరలీబ్యారిస్టర్ గారి సూచనలపై తమఅభిప్రాయమిటుల విశదపరచిరి:-

అక్బరలీబ్యారిస్టరు గారు నూతనోత్సాహముతో స్వదేశమరుదెంచుట మిగుల సంతోషకరము. వారు సంధిసత్యముల ననుసరించి దేశసేవలుపుటకునిశ్చయించుట శుభావహము. నిస్సందేహముగా యిదొకయుత్కృష్టము, పవిత్రవంతమగుయాదర్శమనుట నిశ్చయము. ఇట్టిమహోత్కృష్టవిషయమునుగురించిజనసామాన్యము తమసదభిప్రాయము వెలిబుచ్చుటకువీలుగలదాయనునది ప్రస్తుతము ప్రశ్ననీయాంశము. అక్బరలీగారివంటి ప్రజా సేవకులు సభాసమావేశ వాక్స్వాతంత్ర నాగరకసత్వములులభించుటక్కు ప్రయత్నించుటత్యవసరమని నాకు దోచుచున్నది. ఇట్టినగరసత్వములు ఒడయనంతవరకు వీరభిలషించు "ప్రజాభ్యుదయము" చేకూరకుండుటయేగాక మహాసభసమావేశభావమే నిష్ఫలమగుట నిశ్చయము. ఒకవేళసమావేశములు జరుగగలిగిన ప్రత్యేకముగా రేకొందరికో అవకాశము. లుచిక్కవచ్చును- అంతమాత్రమునకే ఆదర్శము సఫలవంతమనుట భ్రమాజనితము కొబట్టివీరీ ముఖ్యవిషయముల గురించి మార్గదర్శకులు కొనుండుటకు హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాను.



## హిందూ మహమ్మదీయ పోరాటము

3 రు హిందువులు మరణించుట

౧౯ రు హిందువులు గాయపడుట

హిసోల్లా ౨౨-౧౦-౪౬— బిదరుజిల్లాలోని హిలోల్లాయను గ్రామమునందు గతమంగళవారంరోజున(౨౪-౯౪౬) ఘోరమైన హిందూ మహమ్మదీయ సంఘర్షణము జరిగినది. తత్ఫలితముగా హిందువులలో 3రు మరణించి ౧౯రు గాయపడినటుల నిటీవలవార్తలు దెలుపుచున్నవి-వివరములిటుల గలవు:-

మసీదునిర్మాణముగురించి యీ గ్రామమందలి హిందూమహమ్మదీయులలో సుమారు 3 సం॥లనుండి మనస్పర్థలేర్పడినవి- రాజాబాయి యనునామె సుమారు రెండు సంవత్సరములకు పూర్వము ఫాతిమాబీయను నామముతో మహమ్మదీయమతమవలంబించి మహమ్మదీయునిపెండ్లాడుటచే హిందువులక్రోధమునకు మరింతతీవ్రతకలిగెను-ఆరుమాసములకు పూర్వము కొందరార్యసామాజికులరుదెంచి ఆమెను మహమ్మదీయ పెనిమిటిగృహమునుండి తీసుకొల్లి శుద్ధిపరచి నొకఆర్యసామాజికునితో పెండ్లిగావించిరి. మహమ్మదీయ భర్తాయుడు జిల్లా మేజస్ట్రేటునద్ద దరఖాస్తు పెట్టగా వారంటీవ్వ ఆమె కోర్టుకు హాజరయ్యెను-మేజస్ట్రేటు ఆర్యసామాజికుల అరెస్టు వారంటిచ్చి ౨౯ ఆమర్దాదు తేదిని విచారణకై నిర్ణయించెను. దీనివలన ఉభయపక్షములవారిక్రోధములు మితిమీరెను- గత మంగళవారం ౨౪ ఆమర్దాదు మధ్యాహ్నము రెండుగంటలవేళ మహమ్మదీయులు ఈ పాకులు, కత్తులు, లాఠీలు మొదలగువానితో సశస్త్రులై హిందువులపై బడిరి-చాలాసేపుఉభయులు రాళ్లు రువ్వుకొనిరి. దీనివలన యిద్దరు ఆర్యసామాజికులు (దీనియందు రాజాబాయిమరిదిగలడు) ఒక హిందూ స్త్రీ మరణించిరి. ౧౯రుహిందువులు గాయపడిరి-మహమ్మదీయులు హిందూశవముల కాల్చివేసిరి-సాయంకాల మూడుగంటలవరకు పోరాటము విచ్చలవిడిగాజరిగినది- [illegible]గురు మహమ్మదీయులుమాత్రము అరెస్టుగావింపబడిరి-౨౫వ తేదిన హెడ్‌క్వార్టరుకు దెలుపబడుటచే నాయబు నాజంఅగు సయ్యదుమహమ్మదు ముబష్షరుహుసేన్ సూపుగారు ప్రదేశమునకేగి శాంతిపరచిరి-తిరిగెట్టికల్లోలము జరుగకుండుటకై పోలీసుదళము కాపరాగాయుచున్నది-

౧౨వ పేజీ తరువాయి

ఆహమ్మదాబాదువర్తకులు కొందరుతమఊరిలో భారతీయనిర్వహణక్రింద ఒకశాఖ నేర్పరచ దలచినదిగ స్ప్రింగ్ ఫెలో గారినికోరగా, వారందుకుసమ్మతించక భారతీయులకు నిర్వహణకార్యము చేతగాదనిచెప్పిరి. మరల సొరాబ్జి మనస్సుకు కష్టమనిపించెను. కాని తానుబ్యాంకును పెట్టుటకు తనకు మూలధనములేదుకదా! ఇట్లుండ మర్కెంటైల్ బ్యాంకు మేనేజరు రాజీనామానిచ్చినపుడు క్రొత్త మేనేజరు కొఱకై ప్రకటనచేయగా, సొరాబ్జిప్రయత్నించెను. కాని అతనివయస్సు ౩౦ ఏండ్లు మాత్రమేనను కారణముచే అతనిని గ్రహించలేదు.

అదిమొదలుకొని సొరాబ్జి విచారసాగరములోమునిగి నిద్రకూడసరిగాలేకుండెను- ఇట్లుండ తనమనోగతమును ఒకబ్యాంకు అధికారియు తనస్నేహితుడునగుకల్యాంజి వార్ధమ్జీ జెట్సీకి తెలియబరచెను-కల్యాంజి అభావమును మెచ్చుకొని తోడ్పడనంగీకరించెను- కల్యాంజి గొప్పప్రత్తివ్యాపారి, బ్యాంకులో గొప్పఖాతాదారుడు, బ్యాంకుడైరెక్టర్లలోనొకరగు జెట్సీకి బంధువు.అతడుసొరాబ్జికోరిన రు౧౦-౨౦లక్షల అప్పునకై బ్యాంకునుకోరెను. కానిబ్యాంకువారు ఇవ్వలేదు. సొరాబ్జికి పట్టుదల ఇంకను హెచ్చెను.

డైరెక్టర్లుగ పలుకుబడిగలవారల నేర్పరచదలచి అప్పుడు మంత్రులుగనుండిన సర్ లల్లూభాయ్ శ్యామల్దాసు, సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్దాసు, సర్ ఫిరోజ్ సెత్నా, సర్ మనోమోహన్ దాస్ రాంజిగార్లను సొరాబ్జికోరెను.వారలు భారతీయులబ్యాంకులు మునిగిపోవునని చెప్పి సమ్మతించలేదు. సొరాబ్జికి మరియొకపాఠు. ఇట్లుండ సొరాబ్జిచే డైరెక్టరుగానుండుటకు కోరబడిన ఒకపెద్దమనుష్యుడు స్ప్రింగుఫెలోకు సొరాబ్జియత్నములను తెలియజేసెను. స్ప్రింగుఫెలో మొదటనవ్వుకొనెనుగాని, తర్వాత సొరాబ్జినివిచారించి నిజమనికనుగొని, ఆప్రయత్నమును మానుకొనవలసినదిగ చెప్పెను. సొరాబ్జి ఎంతమూరము చెప్పినను వినకపోగా స్ప్రింగుఫెలో అతనిని ౨౪గంటలలోగా తనబ్యాంకులో ఉద్యోగమునువదలుకొనుటకైనను క్రొత్తబ్యాంకు యత్నము వదలుకొనుటకైనను నిర్ణయించికొని తెలుపగోరెను. సొరాబ్జి కొంచెమాలోచించి రాజీనామాఇచ్చివేసెను. స్ప్రింగుఫెలో ఆశ్చర్యముతో సరిగా ఆలోచించుకొనుమని చెప్పినను సొరాబ్జివినలేదు. ఇంటికిపోయి రాజీనామా సంగతిచెప్పగనే ఇంటిలోనివారలు చాలఅరచిరి-కాని భార్య సాకేర్బాయి అతనికి ధైర్యమిచ్చెను.

మరుసటిరోజే సొరాబ్జి కల్యాంజీకలిసి "ఈస్టరన్ బ్యాంకు"అప్పుడే ఖాళీచేసిన గ్రేషంబిల్డింగ్సు నెలకు రూ౬౦౦౦ల అద్దెనిచ్చుటకు ఒప్పుకొనితీసికొనిరి. కల్యాంజి మొదట కావలసినధనమిచ్చెను, రెండుబల్లలు రెండుకుర్చీలుకొని, రాజీనామా నిచ్చిన మరుసటిరోజే సొరాబ్జి ఈక్రొత్తఆఫీసులో కుర్చీపైకూర్చుండెను-కాషియరుకై నెలకు రూ౫౦౦జీతముపై ఈస్టరన్బ్యాంకులో పనిచేయుచున్న క్యాషియరును అదేజీతముపై సంపాదించగలిగిరి-ఈ ముగ్గురుకలిసి ముందుజరుగవలసిన విధానమును ఆలోచించుచుండిరి. తుదకు అంత ప్రసిద్ధిలేని మాంచర్షా యఫ్.ఖాన్, యం.జె. వారద్మాన్, ఆర్దేషిర్ బి.దుబాష్, జంషెడ్జీ-హెచ్. ఖోటియా, రాధాకిషన్ లక్ష్మీచంద్, హెచ్. దావూద్, హెచ్-ఇలియాసు అనువారలనుకోరగా వారలుసమ్మతించిరి. మెమొరాండము, ఆర్టికిల్స్ఆఫు అసోసియేషను ముద్రితమైసిద్ధము చేయబడెను-మొదటిఖర్చులన్నియు కల్యాంజి భరించెను. డైరెక్టర్లబోర్డుకు పలుకుబడిగల ఛేర్మనుకొరకై నలుగురైదుగురిని కోర వారంగీకరించలేదు.

ఇట్లుండ "బ్యాంక్ ఆఫు బర్మా" మునిగెను-కాని మనయువకులు ఇతరుల హేళనలచే సైతము చలించలేదు. వాటాలను పట్టుదలతో సంపాదించసాగిరి. క్రమేణ వాటాలపట్టిక వృద్ధియగుచుండ ౨౧డిసెంబరు ౧౯౧౧ వాడు బ్యాంకునురిజిస్టరుచేసిరి. అప్పుడే సర్ ఫిరోజ్ షా మెహతా గారు భార్యతో ఇంగ్లాండునుంచి వచ్చి బొంబాయిలోదిగిరి. వికాజీకి మెహతా గారిభార్యపరిచయముకుటుంబచేత మెన్నక్రొత్తబ్యాంకువిషయమై చెప్పి ఆమెభర్తను ఆబ్యాంకుడైరెక్టర్లబోర్డునకు అధ్యక్షునిగనుండునట్లుచేయుమనికోరెను- ఫిరోజ్ షా ఒకరోజునిర్ణయించి ఆనాడుమాట్లాడెదనని చెప్పెను. అరోజునవికాజీ, సొరాబ్జి, కల్యాంజీపోయి అంతయూచెప్పిరి. కంపెనీ ఆర్టికిల్సులో వ్యాపారనిర్వహణము సంపూర్ణముగా డైరెక్టర్లబోర్డుఅధికారములో నుండునట్లు సవరణచేసిన అంగీకరించెదనని మెహతా గారుచెప్పిరి. సొరాబ్జిఅందుకుసమ్మతించెను. ౨౧ డిసెంబరు ౧౯౧౧నాటి డైరెక్టర్లసభలో అది ఆమోదింపచేయబడెను. వాటాదారుల ఆమోదముకూడ పొందబడెను. ఇట్లు౨౧ జనవరి ౧౯౧౨నాటి డైరెక్టర్లసభకు మెహతాగారు మొదటిసారి అధ్యక్షతవహించిరి. దానితో వాటాలకై దరఖాస్తులు అపరిమితముగ రాసాగెను. ౧౫ మార్చి ౧౯౧౨వాడు లిస్టుముగిసెను; ౨౦లక్షలు సమకూరెను-సొరాబ్జి నెలకు రూ౭౦౦లజీతము పై అసెంట్రలుబ్యాంకు మేనేజరుగ నియోగించబడెను,

౧౯౧౩ లో బ్యాంకుల ప్రళయము వచ్చెను. అనేకములైన భారతీయబ్యాంకులు మునిగిపోయెను. బ్యాంకులలో డబ్బు దాచుకొన్నవారు అపరిమితముగా లాగుకొనసాగిరి. సెంట్రల్ బ్యాంకునుకూడ ఆఆవస్థరాగా సొరాబ్జి ఎంతో ప్రయత్నించి, తుదకు మెహతాగారు తన వీలునామాలను గిర్వీపెట్టి బ్యాంకుకు డబ్బుతేవచ్చునని చెప్ప తక్కిన డైరెక్టర్లదరు సహాయమునకు వచ్చిరి. అంతటితో డిపాజిట్లకై ఎగబడుప్రజలకు అవిశ్వాసము తొలగెను, ౧౯౨౧ లో సెంట్రల్ బ్యాంకు బొంబాయి ప్రభుత్వముచే పురపాలకసంఘములు మున్నగువాటి ధనమును దాచిపెట్టుకొనుటకు తగినబ్యాంకుగా ఆమోదించబడెను ఆతర్వాతకూడ యూరోపియన్ బ్యాంకులు కొన్ని సెంట్రల్ బ్యాంకుపై అనేకవిధముల కత్తుబట్టెను. వాటినన్నిటినికూడ సొరాబ్జి నేర్పుతో తప్పించి, ౧౯౨౩ లో "యూనియన్ బ్యాంకుఆఫ్ ఇండియా"ను, టాటా ఇండస్ట్రియల్ బ్యాంకును కష్టమువచ్చి మూతపడవేయనున్న సమయములో మూలధనము తగ్గించి సెంట్రలుబ్యాంకులో కలియగలుపుకొనెను. అదిమొదలు సెంట్రలుబ్యాంకు నిర్విఘ్నముగ వృద్ధిజెంది వ్యాపించినది.

గతసంవత్సరము లండనులో సెంట్రలు యక్స్ఛేంజిని స్థాపించుటతో సొరాబ్జియొక్క ఘనత అత్యున్నతదశకెక్కెను. అక్కడినుంచి వచ్చినతర్వాత సొరాబ్జి కొంతకాలమునుండి జబ్బుపడి తుదకు గతవారము భౌతికదేహమును వీడెను.

నిజముగా సొరాబ్జి జీవితచరిత్ర వారికిచ్చిన సన్మానపత్రములో చెప్పబడినటుల ఒక దివ్యమైన కథవలె నుండును. ౨౫ రూపాయల గుమాస్తాపదవినుండి ఒక స్వతంత్రబ్యాంకు మూలపురుషుడగు అదృష్టము సామాన్యము కాదు!

---

The best m
for
reaching 7 million
Andhras,
of the State
Advertise in Golconda
Patrika

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper
of H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రము ఎనిమిది
జిల్లాలలోని ఆంధ్రులలో
మీ వర్తకవ్యాపార
ప్రకటనలు? గోలకొండ
పత్రికలో ప్రకటించుడు

Vol. 12. | Mondy 12—7—1937 | No. 19


## కీ॥ శే॥ సర్. సొరాబ్జి పోచ్ఖానావాలాగారు

### బ్యాంకింగులో భారతదేశ గౌరవమును నిలువబెట్టిన సాహసికుడు

సర్ సొరాబ్జి పోచ్ఖానావాలాగారి మరణమువలన, బ్యాంకింగు వ్యాపారమునందు భారతదేశముయొక్క గౌరవముచిన్నబుచ్చబడుచుండిన సమయమున, దానినికాపాడి, పోషించిన నాథుడు పోయినట్లైనది. సొరాబ్జి ౧౯౧౧వ సంవత్సరములో సెంట్రల్ బ్యాంకును స్థాపించదలచినపుడు ఈనాడు వారియెడ దేశమంతటను ఒకదేశోద్ధారకునియెడనుంబోలె చూపబడుచున్న గౌరవమును వారుపొందనున్నారని ఎవరును అనుకొనియుండలేదు. గత సంవత్సరాంతమున సెంట్రల్ బ్యాంకుయొక్క రజతోత్సవము జరుపబడినపుడు ప్రతి జాతీయపత్రికయును ప్రత్యేకముగ సొరాబ్జిపోచఖన్వాలాగారు సెంట్రల్ బ్యాంకుద్వారా మాతృదేశమునకొక ఘనమైనసేవచేసినందుకు కొనియాడుచు ప్రత్యేకవ్యాసములను ప్రకటించెను. సొరాబ్జీగారి సెంట్రల్ బ్యాంకు వ్యాపారవిజయమును మనదేశములో జరుగుచున్న అనేకములగు ఇతర వ్యాపారవిజయములతో సమానముగ చూడక, దాని నొకదేశాభిమానదృష్టితో చూచుటయందు విశేషకారణము లేకపోలేదు. సెంట్రల్ బ్యాంకును ప్రారంభించుటకు ప్రేరేపణలెవ్వియో తెలిసికొనిన ఆకారణము విశదము కాగలదు. అందుకు సొరాబ్జిగారి జీవితచరిత్రను తెలిసికొనుట ఆవశ్యకము, సొరాబ్జిగారి జీవితచరిత్ర అనేకులగు భారతీయయువకులకు నిరుత్సాహసమయమున ఉత్సాహజనకముగను, ఆదర్శముగను నుండగలదికూడ అయియున్నది.

### కులము, జన్మ

సొరాబ్జి బొంబాయిలో ౯ ఆగస్టు ౧౮౮౧లో జన్మించెను. అతనితండ్రి నూసర్వంజిపోచఖన్వాలా ఆదేశనగరమున ఒకగౌరవముగల మధ్యతరగతి పార్శీవంశమునకు చెందినవాడు. అతడు మొదట మాజగానులోనుండిన మాజగాను హోటలుయొక్కయు, తర్వాత యస్ప్లనేడురోడ్డులో నిప్పటికినినుండు వెలింగ్టనుహోటలుయొక్కయు యజమానిగనుండెను. సొరాబ్జికి సోదరులునలుగురు, సోదరీమణులు ముగ్గురు-అందరిలోను సొరాబ్జియే కడపటివాడు.

### విద్య

సొరాబ్జికి అరేండ్లవయస్సునందే తండ్రిమరణించెను. అప్పటికి సంసారానికు చెందదగిన ఆస్తియేదియు లేకుండుట మరీదురదృష్టము. సొరాబ్జి అన్న హార్జిభాయ్ అప్పుడు "చార్టర్డ్ బ్యాంక్ అఫ్ ఇండియా, ఆస్ట్రేలియా, అండ్ చైనా"లో నెలకు రూ.౧౦౦ ల జీతము సంపాదించుచుండెను. దానితో కుటుంబమునంతయు పోషించుకొనుచు సొరాబ్జికిని, తక్కినసోదరులకును చదువుచెప్పించవలసిన భారము హార్జిభాయ్ పైబడెను. హార్జిభాయ్ అభారమును, తనపాల్యమనుకూడ లెక్కచేయక, సంతోషముతోవహించుచు జన్మాంతమువరకు బ్రహ్మచారిగనుండెను.

సొరాబ్జి న్యూహైస్కూలులో చదివి బొంబాయి మెట్రిక్యులేషను పరీక్షయందు కడతేరిన పిమ్మట సెయింట్ జేవియర్సు కళాశాలలో బి.ఏ. డిగ్రీపొందువరకు చదువదలచి చేరెను. కాని కళాశాలలో నొకటిసంవత్సరమే తప్పనచదివెను. అతనికి ఇక కళాశాలవిద్య లాభములేదనిపించెను. కొట్టిఅతడు ఏదైననౌకరీలో చేరదలచెను, హార్జిభాయ్ అతనిని తానుండుబ్యాంకులోనే నెలకు రూ.౫౦ ల జీతముగల గుమాస్తా పనిలో చేర్పించెను.

ఆచార్టర్డ్ బ్యాంకులో హెడ్‌క్లర్కు సొరాబ్జియొక్క మేనమామయే. అతనిఅన్నకు బుక్‌కీపరుపని-సొరాబ్జిఅన్నక్రింద పనిచేయుటకు నియోగించబడెను. సొరాబ్జి సామాన్యముగా అనేకులు చేయునట్లు పనిచేయలేదు. అబ్యాంకుకు సంబంధించిన ప్రతిశాఖయొక్క పనినిగూడ తెలిసికొనవలెనను కుతూహలము గల్గియుండెను. కాని ఆకాలములో యూరపియుల నిర్వహణక్రింద నుండుబ్యాంకులలో భారతీయులు అన్నివ్యాపారరహస్యములను కనుగొనుశిక్షణ పొందుటకు అనుకూలములు కలిగించెడివారు కారు. తనకులభించినంత అవకాశములో, అన్న బుక్‌కీపరుకాబట్టియు, అతనివద్దకు బ్యాంకుకు సంబంధించినవోచరులన్నియువచ్చును కాబట్టియు బ్యాంకువ్యాపారమునకు సంబంధించిన రహస్యములను అనేకములను నేర్చుకొనుటకు కుతూహలియగు సొరాబ్జికి సౌకర్యములభించెను. ఇట్లురెండేండ్లుగడువగా అన్న జబ్బుపడి సెలవుబెట్టినపుడు సొరాబ్జి అన్న పనినిచాల ప్రశంసనీయముగ నిర్వహించెను.

### ఉద్యోగ నిర్ణయము

సొరాబ్జికి ఈపాటికి తనజీవితము బ్యాంకింగువ్యాపారమునకే నిర్ణయించబడినదను నిశ్చయముకుదిరెను. కనుక ఆశాఖకుతగిన సర్వార్హతలను సంపాదించబూనుకొనెను. అధికారము అందు బుక్‌కీపింగుతరగతులకు పోవుచుండెను. "లండన్ చేంబర్ అఫ్ కామర్స్"వారి పరీక్షలలోను ఇతరపరీక్షలలోను విజయమందెను. ఇట్లు లెక్కలకుసంబంధించిన భాగములో ఘనమైనజ్ఞానము సంపాదించెను. ఒకరోజు తనబ్యాంకుఅఫిసర్లలో నొకరు సొరాబ్జికి "ఇన్‌స్టిట్యూట్ అఫ్ బ్యాంకర్స్, లండన్"వారి జర్నలును ఈయగా, సొరాబ్జి దానినిచదువుచు ఆసంస్థయొక్క పరీక్షలనుగూర్చి చదివెను ఆపరీక్షలలో విజయమందిన ముందుమంచి అదృష్టముండునని యూహించెను. కాని ఆపరీక్షలకు తనుతయారుచేయుటకు ఆరోజులలో బ్లోవియులేకుండెను. అయినను టపాద్వారా విషయములను నేర్పి అపరీక్షలలో విజయమందజేయు వ్యాపారమును సాగించుచున్న ఒకలండన్ బడి ప్రకటనచదివి, దానిసహాయము పొందయత్నించెను. అతనిసోదరులును, మిత్రులును ఈప్రకారముగా పుస్తకములచదువువల్ల బ్యాంకింగుపని తెలియవదికాదనియు అనుభవైకవేద్యము మాత్రమేననియు హెచ్చరించిరి. కానిసొరాబ్జికి పుస్తకజ్ఞానముకూడ అవసరమనునమ్మకము తొలగలేదు. అతడుఎట్లైనను అపరీక్షలలోవిజయమందిడిగ్రీపొందవలెనని పట్టుబట్టెను.

### దినచర్య

తనాశయ మెన్నిగముకొనుటకై సొరాబ్జి చాలకష్టపడి, కొన్నిపూటలుగూడ విరామములేక చదువుచుండెడివాడు. అతనిదినచర్యను మాచిన నిది విశదముకాగలదు. ప్రతిరోజును ౬గం.లకు ముందే నిద్రలేచి ౬॥గం లగునప్పటికి తాను బుక్‌కీపింగు నేర్పుటకై ప్రారంభించిన పాఠశాలకుపోవువాడు. అక్కడ ౧౦గం.లవరకునుండి తర్వాత భోజనముచేసికొని ౧౦॥ గం.లకల్ల బ్యాంకుకుపోవును. అక్కడ సాయంకాలము దాటినతర్వాతగూడ ఉండవలసివచ్చుచుండెడిది. అప్పటికిని పనిముగియకుండిన అదివారము నాడుకూడ పోవలసివచ్చెడిది. ఆఫీసుపని ముగియగానే తనతోడివారలవలె సినిమాలకు షికారులకుబోక నేరుగాఇంటికిపోయి భోజనముచేసికొని కొంతసేపువిశ్రాంతియొ, ఫిడేలో వినుచు శ్రమాపనోదము చేసికొనెడివాడు. మరల ౯॥ గం.టలకే తానుపోదలచిన పరీక్షను చదివెడివాడు. ఇట్లు అర్ధరాత్రివరకు గడచెడిది. తర్వాత నిద్రపోయెడివాడు. తాను ప్రైవేట్లులేకుండ నుండవచ్చునుగాని కుటుంబపోషణభారమును అన్నకుతగ్గించుటకై తానుతన విశ్రాంతినికూడ సంతోషముగావదలుకొనెను. ప్రొద్దుటిపూట బుక్‌కీపింగు నేర్పెడి అబడియేగాక, ఇంకను తీరికదొరకిన ట్యూషన్లు నేర్పెడివాడు. కీర్తిశేషులైన ఆర్.డి. విసన్జిఅంజగారిఇంటిలో పిల్లలకు బుక్‌కీపింగు తర్కవిషయములునేర్పి ఈవాడు "మెసర్స్ విసన్జిఅండుసన్సు"అను కంపెనీయజమానులగు మథురదాస్, కర్సన్‌దాస్, విఠల్‌దాస్‌లను వాణిజ్యవిద్యలో ప్రవీణులజేసినది సొరాబ్జియే. సొరాబ్జికుటుంబమునకును, విసన్జికుటుంబమునకును ౩౦ఏండ్లనుండి గలసంబంధము ఈనాటికినినిలచియున్నది. సొరాబ్జిని విసన్జికుటుంబములో నొకనిగచూచుకొనుచు ఆదరించెడివారు. సొరాబ్జిపలుమారులు విసన్జివితనపోషకునిగ చెప్పుకొనెడివాడు.

తనఅన్నయు, ఒకమామయు ఉన్నబ్యాంకులో నేపనిచేయుచుండుటవలన కొంతకమును, సొరాబ్జీ ఫారిన్ యక్స్ఛేంజి వ్యాపారరహస్యములను నేర్చుకొనగలిగెను. ఈవ్యాపారరహస్యములను తెలిసిన భారతీయులుముగ్గురుమాత్రమే (సొరాబ్జిమేనమామ, అన్న, మర్కెంటైల్ బ్యాంకు హెడుక్లర్కు) ఉండినట్లు చెప్పబడు ఆరోజులలో (ఏలనభారతీయులను ఈ రహస్యములను తెలిసికొననిచ్చెడివారు గారు)

సొరాబ్జి అవిషయములను తెలిసికొనగల్గుట విశేషమైనసంగతియే.

౧౯౦౫లో సొరాబ్జిమేనమామ మరణించెను. హార్జిబాయ్ హెడ్‌క్లర్కు చేయబడెను. సొరాబ్జి బుక్‌కీపర్ అయ్యెను. హార్జిబాయ్‌మరి ౧౫ఏండ్లు హెడ్‌క్లర్కుగనే పనిచేసెను. ఆకాలమందు భారతీయులకు ఆఫీసర్‌గ్రేడు ఇవ్వకూడదని యక్స్ఛేంజిబ్యాంకులు నిర్ణయించుకొనియుండెను. సొరాబ్జితలపెట్టిన "ఇన్‌స్టిట్యూటు అఫ్ బ్యాంకర్సు, లండన్"పరీక్షలో మొదటిభాగమునుకడతేరెను. ఈపరీక్షలలో మొదటిభాగము రెండవభాగములలో కడతేరినవారలకు లండన్ బ్యాంకులు ప్రత్యేకముగ ౫పౌనులు, ౧౦పౌనుల బోనసు చెల్లించుచుండెడివి. అదితనకుకూడలభించునని సొరాబ్జిఆశపడి లండన్ హెడ్ అఫీసుకువ్రాయగా, ఆ బోనసులు భారతీయులకీయబడవని జవాబువచ్చెను, ఇదివరకే భారతీయులకు బ్యాంకుల రహస్యములను నేర్పుటలో సౌకర్యమొసగకుండుట యనునదియు, భారతీయులకు ఆఫీసర్లపదవులీయకుండుటయు గాక ఈక్రొత్తదికూడచేరి సొరాబ్జిమనస్సును కలతబరచెను. అయినను అతడు రెండవభాగముచదివి ఒక 'పొలిటికల్ యకానమీ'తప్పతక్కిన అన్నివిషయములలోను కడతేరెను-

౧౯౦౬లో 'బ్యాంకుఅఫ్ ఇండియా'స్థాపించబడినపుడు అందులో పదవికైయత్నించి రూ.౧౫౦ లపై సబ్ అకౌంటెంటుగ చేరెను-ఇంటిలోవారలు చార్టర్డుబ్యాంకును వదలవలదని ఎంతచెప్పినను, సొరాబ్జివినలేదు; 'బ్యాంకుఅఫ్ ఇండియా' స్వదేశీయులచే స్థాపించబడినదనియు, అందులోనుండు అభివృద్ధి సుసాధ్యమనియు అభిప్రాయముతో చేరెను- కాని బ్యాంకు ప్రారంభించబడునప్పటికి డైరెక్టరుల ఏర్పరచిన మేనేజరుఅధికారము స్వీకరించలేదు- బాధ్యతనంతయు సొరాబ్జినిర్వహించవలసివచ్చెను-అప్పుడు సొరాబ్జి మంచిపేరుసంపాదించెను- తుదకు నెలకు రూ.౫౦౦౦ ల జీతముపై స్ట్రింగుఫెలో అను మేనేజరుకుదిరెను- స్టీవర్టును యూరపియుడు అకౌంటెంటుఅయ్యెను- అతనికిసొరాబ్జిని మేనేజరు అభిమానించుచు గొప్ప బాధ్యతగల పనులనప్పగించుటయు, అందుమూలమున అతనికిగొప్పతనమువచ్చుటయు కడుపుమంటగనుండెను- అందుచే సొరాబ్జి ప్రాముఖ్యతనుతగ్గించదలచి ఇకమీదట చెక్కులు వేచర్లు అకౌంటెంటు ఆమోదించిననేగాని చెల్లవనిఏర్పాటుచేసెను- సొరాబ్జివినయముతో సరేననెను- ఇంతలో గ్రేఅనునతడు ఆసిస్టెంటు అకౌంటెంటుగ నియోగించబడినపుడు అతనికి అట్టి నిర్బంధములేవియు చేయబడకపోవుటయేగాక సొరాబ్జిసంతకము చేసిన వోచర్లను, చెక్కులను అకౌంటెంటుగాని, గ్రే గాని ఆమోదించవలసియుండునని స్టీవర్టువిధించెను- ఇదియు సొరాబ్జిఆత్మగౌరవమునకు అతృప్తికలిగించెను- అతడు మేనేజరుతోను, డైరెక్టరులతోను చెప్పకొన్ననులాభములేకపోయెను- అంతటయూరపియుల నిర్వహణలోనుండు బ్యాంకులలో భారతీయులకిట్టి యవమానములేగదా సంప్రాప్తించుచుండునని సొరాబ్జికి దృఢవిశ్వాసముగలిగి సొంతముగ ఒకస్వదేశీ నిర్వహణగలబ్యాంకును స్థాపించదలచెను- అఉద్దేశ్యముతో ఎక్కువఅర్హతను సంపాదించుటకై పూర్వముతప్పిపోయిన 'పొలిటికల్ యకానమీ' మరలపట్టుదలతో చదివికడతేరి: "లండన్ ఇన్‌స్టిట్యూట్ అఫ్ బ్యాంకర్సు' యొక్క 'సర్టిఫికెట్ అసోసియేట్,, అయ్యెను- ఇంతకుపూర్వము మరేభారతీయుడును ఈపట్టాపొందియుండలేదు-

సొరాబ్జియొక్క క్రొత్త ఉద్దేశ్యమునకు అతనిభార్య సాకేర్బాయి సంపూర్ణప్రోత్సాహము నిచ్చెను. ఆకాలములో "స్వదేశీ, స్వదేశీ,,యని భారతదేశమంతటనుమారుమ్రోగుచుండెను. అనేక స్వదేశీబ్యాంకులులేచెను. అవన్నియు మునిగిపోవునని అనేకులు తలచుచుండిరి.

అం వ పేజి చూడుడు

Printed and Published by G, Ramakrishna Reddy at the Golkonda PowerPress Hyderabad. Editor K. Balakrishna Reddy